

ఓమ్

సర్వస్వాత్మైకినమః



# భక్తి తత్త్వ దర్శనము

(శాండిల్య నారద మహర్షులు)








చర్ల గణపతిశాస్త్రి

ఓమ్

సరస్వత్యై నమః

# భక్తితత్త్వ దర్శనము

( శాండిల్య నారద మహర్షులు )







చర్ల గణపతిశాస్త్రి

# భక్తితత్త్వ దర్శనము

## [మొదటి ప్రకరణము]

### భక్తి భూమిక

మూ. అథాతోభక్తి జిజ్ఞాసా. (శాండిల్య ౧. ౧.)
సూ. మఱి యింక భక్తి జిజ్ఞాస చేయఁబడుచున్నది.

భజ = సేవాయాం భజ = సేవించుట అను క్రియవలన భక్తి అను పదము ఏర్పడుచున్నది. సర్వేశ్వరుని మనస్సుతోను వాక్కులతోను కర్మలతోను సేవించుట (స్మరణాదినవవిధభక్తి) యని భావము. సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ (ఆ బ్రహ్మము సత్యజ్ఞానరూపుఁడు అనంతుఁడు (తై. ౨. ౧.) అహంబ్రహ్మాస్మి (నేను బ్రహ్మమునై యుంటిని) తత్త్వమసి (ఆ బ్రహ్మము నీవై యుంటివి) (బృహ. ౧. ౪. ౭) సర్వం ఖల్విదం బ్రహ్మ (ఇది యంతయు బ్రహ్మమే) నాన్యతోఽస్తి ద్రష్టా శ్రోతా మంతా విజ్ఞాతా (ఈ బ్రహ్మము కంటె వేఱుగాఁ జూచువాఁడును వినువాఁడును మననముచేయు వాఁడును తెలిసికొనువాఁడును లేఁడు) (బృహ. ౩. ౭. ౨౩) ఇత్యాది శ్రుతులు జీవబ్రహ్మలకైక్యమును బోధించుచున్నవి. ఒకరు సేవించు వారుగను ఇంకొకరు సేవింపఁబడువారుగను లేరు అని తెలుపుచున్నవి. 'యతోవా ఇమానిభూతానిజాయంతే యేన జాతానిజీవంతి యత్ప్ర యంత్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ' ఏ బ్రహ్మమువల్ల ఈ భూతములు పుట్టుచున్నవో దేనిచేఁ బుట్టి జీవించుచున్నవో దేనియందు లయించుచున్నవో దానిని తెలిసికొనుము (తై. ౩. ౧.) అజాయ

మానోబహుధా విజాయతే (పుట్టనివాఁడైనను అనేక విధములుగఁ బుట్టుచున్నాఁడు (శ్రుతి) తయోరన్యః పిప్పలంస్వాద్వత్త్యనశ్నన్యో అభిచాకశీతి (ఆ జీవబ్రహ్మలలో జీవుఁడు స్వాదువైన కర్మఫలమును భుజించుచున్నాఁడు. ఇతరుఁడైన పరమాత్మ సాక్షిగా నున్నాఁడు. (శ్వేతాశ్వ ४. ౬) సర్వస్యవశీసర్వస్యేశానః సర్వస్యాధిపతిః (అన్నిటిని వశమందుంచుకొన్న వాఁడు అన్నిటికి ఈశ్వరుఁడు అన్నిటికి అధిపతి (బృహ) తమేవవిదిత్వాతిమృత్యుమేతినాన్యః పంథాః విద్యతేఽయ నాయ. ఆ బ్రహ్మమును దెలిసికొని మృత్యువును దాటును మోక్ష మార్గముకొఱకు ఆ బ్రహ్మమును దెలిసికొనుటకంటె ఇంకొకమార్గము లేదు. ఆత్మావా అరేద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యోనిధిధ్యాసి తవ్యః ఆత్మేత్యేవోపాసీత (బృహ. ౨. ४. ౫. ౭) ఓయి ఆత్మయె చూడఁదగినది విన్నఁదగినది మననము చేయఁదగినది ఆత్మయనియె ఉపా సింపవలెను. (బృహ. ౨ ४. ౫ ౭) ఏషహ్యేవానందయాతి (ఇతఁడే ఆనందపెట్టును (తై. ౨ ౭.) సోఽన్వేష్టవ్యః సవిజ్ఞాసితవ్యః (ఆ పరమాత్మ అన్వేషింపఁదగినవాఁడు. అతఁడే విశేషముగా జిజ్ఞాసింపఁ దగినవాఁడు) ఛాం, ౮. ౭. ౧) ఇత్యాది శ్రుతులు జీవబ్రహ్మలను భిన్నులనుగను జీవుఁడు దర్శనాధులడారా ఉపాసించువాఁడుగను పరమాత్మ ఉపాసింపఁదగినవాఁడుగను తెలుపుచున్నవి. మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః (జీవలోకమున సనాతనుఁడైన జీవుఁడు నా యంశమె (గీత. ౧౫. ౭) స్వభక్తం వాసుదేవోఽపి సంప్రాప్యానంద మక్షయం, పునరావృత్తి రహితం స్వీయ ధామ ప్రయచ్ఛతి (వాసు దేవుఁడును తన భక్తునిబొంది ఆనందరూపమైన నాశములేని తిరిగి పుట్టుకలేని తన ధామమును ఇచ్చును) ఇత్యాది శ్రుతులు జీవుఁడు ఉపాసకుఁడు పరమాత్మ యుపాస్యుఁడు అని తెలుపుచున్నవి. ఈ ద్వైత శ్రుతులను అద్వైతులు అద్వైతపరముగ సమన్వయించుచున్నారు.

జీవుఁడు బ్రహ్మమునకు ప్రతిబింబమనియు భ్రాంతిలోనున్న జీవుఁడు తాను త్రాడునుజూచి సర్పభ్రాంతిలోపడినవానివలె సుఖదుఃఖాదులు పొందుచున్నాఁడే గాని ఆత్మరూపుఁడైన జీవునికి సుఖదుఃఖాదులు లేవనియు భ్రాంతిపోఁగానే తాను బ్రహ్మముకంటె వేఱు కానని తెలిసి కొనుచున్నాఁడు. ఆ భ్రాంతిలో నున్నవారికే గురువు శాస్త్రాదులు అవసరమని వేదాంతులు ద్వైతము మందమధ్యమాధికారులకు, అద్వైతము ఉత్తమాధికారికి అని తెలుపుచున్నారు. విశిష్టాద్వైతులు ద్వైతులు జీవబ్రహ్మాదులు అనాదులనుచున్నారు. ఇట్లే అనేకులు అనేక విధములుగఁ దెలుపుచు అథాతో బ్రహ్మ జిజ్ఞాసా అను బ్రహ్మసూత్ర మును ఇంక కర్మాధిగమమునకు పిదప బ్రహ్మము అనఁగా నిరస్త దోషుఁడును అసంఖ్యేయ కళ్యాణగుణుఁడును అయిన పురుషోత్తముని దెలిసికొనఁ గోరవలయును" అని వ్యాఖ్యానించుచున్నారు. ఏది యెట్లైనను శరీరభాస యున్నంతవఱకు జీవులందఱు భ్రాంతులే గనుక కర్మజ్ఞాన భక్త్యాదుల ద్వారా తమ భ్రాంతిని జీవులు ఎట్లును పోఁగొట్టు కొని భగవదైక్యమును పొందవలసినవారే గనుక మహర్షులు అనేక దర్శనములచే కర్మజ్ఞాన భక్త్యాదులను వివరించి జీవలోకమునకు మహోపకారము చేసియున్నారు. కర్మజ్ఞానములు పూర్వోత్తర మీమాంసలలో వివేచింపఁబడినవి. అవి నా బ్రహ్మసూత్రాది దర్శనము లలో విస్తరింపఁబడినవి. భక్తిని శాండిల్య నారదాది మహామునులు తమ దర్శనములలో వివేచించిరి. ఇవుడాదర్శనములు యథాశక్తి వ్యాఖ్యానింపఁబడుచున్నవి.

మూ. అథాతో భక్తిం వ్యాఖ్యాస్యామః (నార. ౧.)

సూ. మఱి యింక భక్తిని వ్యాఖ్యానింతుము.

మూ. సా పరానురక్తిరీశ్వరే (శాం. ౨.)

సూ. భగవంతుని మీఁదఁగల పరమానురాగమె భక్తి.

మూ. సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా. (నార. ౨)

సూ. ఈ భగవంతుని మీఁద మిక్కిలి ప్రేమ గలిగియుండుటె భక్తి.

భార్యాపుత్రులు ధనకనకవాహనాది వస్తువులు మొదలైన వానికంటె మిక్కిలి ప్రేమ భగవంతునిమీఁద నుండుటయె భక్తియని భావము.

ఆ. సుతుల హితుల విడిచి చుట్టాల విడిచి యి
ల్లాలి విడిచి బహుబలాళి విడిచి
రాజు హృదయ మిడియె రాజీవనయనుపై
ధనము విడిచి జడ్డుఁదనము విడిచి. (భాగవత. ౨. ౪౩.)

రాజు = పరీక్షిత్తు జడ్డుదనము = కాంతి.

మూ. అమృతస్వరూపాచ. (నార. ౩)

సూ. ఆ భక్తి అమృతస్వరూపమైనది.

జరామరణ రోగాదులనుండి అమృతమెట్లు ముక్తి కలిగించునో అట్లె యీ భక్తి సకలబాధలనుండి ముక్తి కలిగించునది యని భావము. అమృతమనఁగా మోక్షము గూడ అర్థము. సుఖదుఃఖాది ద్వంద్వముల నుండి స్వర్గనరకములనుండి జన్మ మృత్యు జరాదులనుండి మోక్షము విడుదల కలిగించునట్లు ఈ భక్తియును సుఖదుఃఖాదులనుండి విడుదల కలిగించునని భావము. సకల ద్వంద్వ మోక్షమె మోక్షమైనట్లు ఇతర సేవ చేయక భగవత్సేవ అనఁగా భక్తిచేయుటయె మోక్షమనియుఁ దెలియఁదగును.

కం. హరివార్త లెఱుఁగువారికి
హరిపదములు దలఁచువారి కనవరతంబున్

హరికథలు వినెడివారికి
మరణాగతమోహ సంభ్రమము లేదనభూ. (భాగ. ౧.౪౦౩)

మ. విను మంభోజభవుండు మున్ను మదిలో వేదంబ మువ్మారు నె
మ్మన మందుండలపోసి యెంతయుఁబరామర్శించి మోక్షంబు ద
క్కిన మార్గంబున లేవటంచు హరిభక్తిం జింతసేసెన్ జనా
ర్దను నాత్మాకృతి నిర్వికారుఁడగుచున్ దన్మార్గ నిర్ణేతయై
(భాగ. ౨. ౩౫)

మూ. తత్సంస్థ స్యామృతత్వోపదేశాత్ (శాండిల్య. ౩.)

సూ. భగవంతునియందు సరియైన నిష్ఠగలవానికి అమృతత్వము (మోక్షము) గలుగునని యుపదేశించుట వలన భక్తి స్వరూపము యొక్క జిజ్ఞాస చేయువలసియున్నది.

బ్రహ్మ సంస్థోఽమృతత్వమేతి. (బ్రహ్మమందు (సమ్యక్-స్థా) సరియైన నిష్ఠగలవాఁడు మోక్షము పొందును (ఛాందోగ్య ౨. ౨౩-౨) అని యుపనిషత్తులోఁ జెప్పఁబడినది. బ్రహ్మమనఁగాఁ బురుషోత్తముఁడు అని భావము.

మూ. జ్ఞానమితిచేన్న, ద్విషతోఽపిజ్ఞానస్యతదసంస్థితేః (శాం. ౪)

సూ. నిష్ఠ (భక్తి) యనఁగా జ్ఞానమని యనరాదు. అట్లన్నచో ద్వేషించువానికున్న జ్ఞానమునకు ఆ నిష్ఠ కనిసింపవలసివచ్చును అట్లు కనిపింపక పోవుటవలన అట్లనరాదు.

ఇక్కడ జ్ఞానపదము ధర్మార్థ కామరూప త్రివర్గవిషయిక జ్ఞానపదము. అట్టి జ్ఞానముగల హిరణ్యకశిపాదులకు భగవన్నిష్ఠ భక్తి కనిపింపక పోవుటవలన భక్తి యనఁగా జ్ఞానమనరాదని భావము. కనుకనె ప్రహ్లాదునికి వర్గత్రితయము బోధింపఁబడెను. వాస్తవమునకు

సర్వంఖల్విదంబ్రహ్మ. అంతయు భగవత్స్వరూపమె అనునదే జ్ఞానమన్నచో అట్టి జ్ఞానముగలవానికి ద్వేషమెయుండదు. అపుడా జ్ఞానికి భక్తునికి బాహ్యరూపములోనె గాని అంతస్సులో భేదము గలుగదని తెలియవలయు. కనుకనె "తనయందు నఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబున జరుగువాఁడు (భాగ. ౭. ౧౨౫) అని భక్తుఁడైన ప్రహ్లాదుఁడు జ్ఞానిగా వర్ణింపఁబడెను. విష్ణుఁడింతియకాని వేఱొండు లేదని యెుత్తిలి నగుచుండు నొక్కచోట "ప్రహ్లాదునికి సర్వము విష్ణుమయముగానే తోఁచినది" విశ్వమందుఁ గన్న విన్న యర్థములందు వస్తుదృష్టిఁజేసి వాంఛయిడఁడు. (భాగ. ౭. ౧౨౭) అతనికి సర్వము విష్ణుమయముగానె గాని వస్తువుగా తోఁచలేదు.

మూ. తయోపక్షయాచ్చ. (శాం. ౫)

సూ. అనిష్ఠ (భక్తి) చే జ్ఞానము క్షయము పొందుట వలనను నిష్ఠయనఁగా జ్ఞానముగాదు.

జ్ఞానము = త్రివర్గవిషయికజ్ఞానము. కేవల శుష్కశాస్త్రజ్ఞానము కనుకనే ప్రహ్లాదుఁడు ఇట్లని యెను.

కం. చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థముఖ్యశాస్త్రంబులు నేఁ
జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్ల జదివితిఁ దండ్రీ"

అని చెప్పి.

మ. తను హృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స

జ్ఞుఁడై యుండుట భద్రమంచుఁదలఁతున్ సత్యంబు దైత్యోత్తమా అనియు, "దేవదేవునిఁ జింతించు దినము దినము, చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు" అని చెప్పెను.

మూ. ద్వేష ప్రతిపక్షభావాత్ రసశబ్దాచ్చ రాగః (శాం. ౬)

సూ. ద్వేషమునకు విరోధియైనదగుటవలనను రసశబ్దముచేఁ దెలియఁబడినదగుటవలనను భక్తి రాగస్వరూపమైనది.

రసంహ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి (తై. ౨. ౭) రసమునే పొంది యితడు ఆనందముగలవాఁడగును."

కం. హరిముఖకమలముఁ జూచుచుఁ
దరుణి యొకతె ఱెప్పవిడక తనియకయుండెన్
హరిపదకమలముఁ జూచుచు
మరగి తనివిలేని సుజనుమాడ్కి నరేంద్రా.

(భాగ. ౧౦. పూ. ౧౦౬౪)

ఇట గోపికకుండు భక్తి రాగరూపముగా నున్నదని గ్రహింపవలయునని భావము.

మూ. న క్రియా కృత్యనపేక్షణాత్ జ్ఞానవత్ (శాండిల్య. ౧. ౭)

సూ. కర్తయొక్క ప్రయత్నమును అపేక్షించునది గాన జ్ఞానమువలె భక్తి యాచరణరూపమైనది కాదు.

మ. ఘనులై యెవ్వని పాదపంకజపరాగ ధ్యానసంప్రాప్తియో
గ నిరూఢత్వముచే మునీంద్రులు మహాకర్మంబులం బాసి బం
ధ నిరోధంబులులేక విచ్చలవిడిన్ దర్పింతు రాదివ్య శో
భనుఁ డెట్లుండినునుండెఁగాక కలవే బంధంబులుర్వీశ్వరా॥

(భాగ. ౧౦. పు. ౧౧౧౦)

అ. మదిచే సర్వకర్మల్ నా, కర్పించి మత్పరుండవై
బుద్ధియోగ మాశ్రయించి, నన్నెయెప్పుడు నెంచుమీ.

(నా తెనుఁగుగీత ౧౮ ౫౭)

మూ. అత ఏవ ఫలానంత్యం (శాండిల్య. ౧. ౮.)

సూ. కనుకనే భక్తిఫలము అనంతమైనది.

కం. హరి భగవంతుఁ డనంతుఁడు
కరుణాంబుధి సృష్టికార్య కారణహేతు
స్ఫురణుం డవ్విభుకంటెం
బరుఁడెవ్వఁడు లేఁడు తండ్రి పరికింపంగన్

అనంతుఁడైన పరమేశ్వరుని బొందుటయె భక్తికి అనంతఫలమని భావము.

అ. సర్వభూతంబులందున్న, యాత్మను నేనె యర్జునా!
నేనె ప్రాణులకాదిని, నేనె మధ్యము నంతమున్

(నా తెనుఁగుగీత ౧౦. ౨౦)

అనియును గీత చెప్పుచున్నది

మూ. తద్వతః ప్రపత్తి శబ్దాచ్చ నజ్ఞాన మితర ప్రపత్తిశబ్దవత్.

(శాండిల్య. ౧. ౮.)

సూ. జ్ఞానవంతుఁడును భగవంతుని శరణంబునని చెప్పుటచేత నే ఇతరులను బొందుటవలె జ్ఞానము భక్తిరూపము గాదు.

అ. ఎన్నో జన్మలచివరన్, సర్వంబు పరమేశుఁడే,
అంచు జ్ఞానుల్ ననుంగాంతు, రామహాత్ములు దుర్లభుల్.

(తెనుఁగు గీత ౭. ౧౯)

అ. ఆయా కోర్కెల జ్ఞానమేగన్, స్వస్వప్రకృతి పీడక
యాయా నియమముల్ పొంది, సేవింతురన్యదేవతల్
(తెనుఁగు గీత ౭. ౨౦)

మూ. యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధోభవతి, అమృతో భవతి తృప్తోభవతి. (నారద. ४.)

సూ. ఆ భక్తిని పొంది పురుషుఁడు కార్యసిద్ధిని పొందును, అమృతుఁడగును తృప్తుఁడగును.

ఉ. ఇంచుకమాయలేక మదినెప్పుడుఁ బాయని భక్తితోడ వ
ర్తించుచు, నెవ్వఁడేని హరిదివ్య పదాంబుజ గంధరాశి సే
వించు, నతండెఱుంగు నరవిందభవాదులకైన దుర్లభో
దంచితమైన యా హరి యుదార మహాద్భుత కర్మమార్గముల్
(భాగ. ౧. ౩४)

మూ. యత్ప్రాప్య న కించి ద్వాంఛతి నశోచతి నద్వేష్టి నరమతే నోత్సాహీభవతి. (నార. ౫)

సూ. ఆ భక్తిని బొంది యింకేమియుఁ గోరఁడు దుఃఖింపఁడు ఎవరిని ద్వేషింపఁడు ఇతరమైనదానిచే సంతోషింపఁడు ఇంక దేనిని పొందుటకు ఉత్సహింపఁడు.

సీ. శ్రీవల్లభుఁడు దన్నుఁ జేరినయట్లైనఁ
జెలి కాంచ నెవ్వరిఁ జేరమఱచు
అసురారి తనప్రోలనాడిన యట్లైన
నసుర బాలురతోడ నాడమఱచు
భక్తవత్సలుఁడు సంభాషించినట్లైనఁ
బరభాషలకు మాఱుపలుక మఱచు

సురవంద్యుఁ దనలోనఁ జూచినకతైనఁ
జొక్కి సమస్తంబుఁ జూడమఱచు.

గీ. హరిపదాంభోజ యుగచింత నామృతమున
నంతరంగంబు నిండినకతైన నతఁడు
నిత్య పరిపూర్ణుఁడగుచు నన్నియును మఱచి
జడత లేకయు నుండును జడునిభంగి

(భాగ. ౭. ౧౨౨)

అను. హర్షింపక ద్వేషింపక, కుందక కోర్కెపూనక
శుభాశుభ ఫలంబులన్, వీడు భక్తులె మత్ప్రియుల్,

(గీత. ౧౨. ౧౭)

మూ. యత్ జ్ఞాత్వామత్తోభవతి స్తబ్ధోభవతి ఆత్మారామోభవతి.

(నారద. ౬)

సూ. ఆ భక్తినిపొంది తన్మయుఁడగును శాంతుఁడగును ఆత్మయందె విహరించువాఁడగును.

శా. పానీయంబులు త్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హాసలీ
లా నిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీ నారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డేతద్విశ్వమున్ భూవరా?

(భాగ. ౭. ౧౨౩)

మూ. సా న కామయమానా నిరోధరూపత్వాత్ (నార. ౭)

సూ. భక్తి త్యాగరూపమైనది గానఁ గోరికలతోఁ గూడినది గాదు.

భక్తులు ధన, సంతతి, స్వర్గాదులనేగాక మోక్షమునుగూడ గోరరాదు. కోరికలతోఁ గూడినది యుత్తమ భక్తి గాదు. యథార్థ భక్తులు సాలోక్యమును (సమాన లోకప్రాప్తిని) సార్ష్టి (సమానైశ్వర్య ప్రాప్తిని) సామీప్యమును (సమీపమందుండుటను) సారూప్యమును (సమానరూపమును) సాయుజ్యమును (సమానలయప్రాప్తిని) ఇచ్చినను గాని కోరరని కపిల భగవానుఁడనెను

మూ. నిరోధస్తు లోకవేదవ్యాపారన్యాసః (నార. ౮)

సూ. త్యాగమనఁగా లౌకిక వైదిక వ్యాపారములను విడిచి పెట్టుట.

సీ. నీ పాదకమలంబు నమ్మి డగ్గఱఁగాని
తరలిపోవంగఁ బాదములు రావు
నీకరాబ్జంబు నెఱి నంటి తివఁగాని
తక్కనపనికి హస్తములు సొరవు
నీ వాగమృతధార నిండఁ గ్రోలఁగఁ గాని
చెవు లన్యభాషలు సేరి వినవు
నీ సుందరాకృతి నియతిఁ జూడఁగఁ గాని
చూడ వన్యంబులఁ జూడ్కి కవలు.

గీ. నిన్న కాని పలుకనేరవు మా జిహ్వ
లొల్లవనుచుఁ బలుకనోడనీవు
మా మనంబులెల్ల మరిఁగించి దొంగిలి
తేమి సేయువారమింకఁ గృష్ణ.

(భాగ. ౧౦. పు. ౯౯౨)

మూ. తస్మిన్ననన్యతా తద్విరోధిషూదాసీనతా చ. (నార. ౯)

సూ. పరమేశ్వరుని యందైక్యమగుటయు ఆ పరమేశ్వర విరోధభావములందు అంటి ముట్టకుండుటయును త్యాగమనఁబడును.

మూ అన్యాశ్రయాణాం త్యాగోఽనన్యతా. (నార. ౧౦)

సూ. పరమేశ్వరునిగాక మిగిలిన యాధారములను విడుచుటయే యైక్యమగుట యనఁగా.

మూ. లోకే వేదేషు తదనుకూలాచరణం తద్విరోధిషూదాసీనతా. (నార. ౧౧.)

సూ. పరమేశ్వరభావములకుఁ బ్రతికూలమైన భావములందు అంటి ముట్టకుండుట యనఁగా లౌకిక వైదికాది కర్మలలో భగవత్తత్త్వమునకు అనుకూలమైన యాచరణ చేయుటయె.

ఇది మొదటి ప్రకరణము



# భక్తితత్త్వ దర్శనము
## రెండవ ప్రకరణము
### భక్తి వివరణ

సూ. సాముఖ్యా ఇతరాపేక్షితత్వాత్ (శా. ౧౦)

సూ. జ్ఞానము యోగము మొదలగునవి భక్తికి అంగములుగా అపేక్షింపఁబడుటవలన ఆ భక్తియె ముఖ్యమైనది.

మూ ప్రకరణాచ్చ (శాం. ౧౧)

సూ. ప్రకరణమునుబట్టియు భక్తియే ముఖ్యమైనది. ఛాందోగ్యోపనిషత్తులో "ఆత్మైవేదం సర్వమితి సవాఏష ఏవంపశ్యన్నేవంమన్వాన ఏవంవిజానన్నాత్మరతి రాత్మక్రీడ ఆత్మమిథున ఆత్మానందః స స్వరాడ్ భవతి తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి. (ఛాం. ౭. ౨౫. ౨)

'ఇది సర్వమాత్మ యిట్లుగనుము'

మధు. ఎవ్వఁడిట్టులఁ జూచుచు నిట్టులఁ దలంచుకొనుచు
ఆత్మనే విహరించుచు నాత్మనే యాడుకొనుచు
అత్మనే సంగమించుచు నాత్మనానందపడునొ
వాఁడె స్వారాట్టు, సర్వవిశ్వముల స్వేచ్ఛగఁ జరించు.

నా ఉపనిషత్సుధ

(ఛాం. ౭. ౨౫, ౨)

మూ. దర్శనఫలమితిచేన్న తేన వ్యవధానాత్ (శాం. ౧౨)

సూ. ఆ యుపనిషత్తుచే భక్తికి ఫలముగా స్వరాజ్యసిద్ధి చెప్పఁబడలేదు. దర్శనమునకే (అనఁగా జ్ఞానమునకే) ఫలముగాఁ జెప్పఁబడెనన్నచో అప్పుడు దర్శనవాచకపదముతో వ్యవధానము ఉండుట

వలన ఆ స్వారాజ్యసిద్ధి భక్తికే ఫలము. ‘వంపశ్యన్ ఆత్మానంద ! స్వరాడ్భవతి అని స్వరాడ్ పదము ఆత్మానందపరము. దగ్గఱగా నుండుటచే ఆ స్వరాడ్సిద్ధి భక్తికేయని భావము.

మూ. దృష్టత్వాచ్చ (శాం. ౧౩)

లోకములో జ్ఞానము అంగముగాను భక్తి అంగిగాను అనఁగ ముఖ్యముగాఁ జూడఁబడుటవలనను భక్తియే ముఖ్యమైనది.

మూ. అతఏవ తదభావాద్వల్లవీనాం (శా. ౧౪)

సూ. భక్తి ముఖ్యము జ్ఞానము అంగము కనుకనే జ్ఞానము లేకపోవుటవలనను గోపికలకు ముక్తి కల్గెను.

గీ. ఎన్నొ యవతారములు పరమేశ్వరునకు
భువన కళ్యాణకరములై పొలుచుఁగాక
గోవులకు గోపకులకు గోపికలకును
గృష్ణుఁడేగాక ముక్తి నింకెవఁ డొసంగె.

(నా శ్రీకృష్ణ హృదయామృతము ౧౬)

సీ. తరళాక్షులార ! మద్భక్తి చేతనులకు,
దనరు మోక్షానందదాయకంబు
జపతపోవ్రతదాన సత్కర్మముల ముక్తి
కలుగంగనేరదు.

(భాగ. ౧౦. ఉ. ౧౦౭౧)

మూ. భక్త్యా జానాతీతిచేన్న అభిజ్ఞప్త్యా సామర్థ్యాత్.

(శాం. ౧౫)

సూ. 'భక్తి చేఁ దెలిసికొనుచున్నాఁడు' అని గీతలోని వాక్యమునుబట్టి భక్తిసాధనమగునుగదా అన్నచో— 'భక్త్యామామభిజానాతి' అని గీతలో అభిజానాతి' అని చెప్పుటచే ఆ భక్తి అభిజ్ఞప్తిగా పూర్వపు జ్ఞానమును గుర్తించి చెప్పుటచే మొదట జ్ఞానము సాధనముగాను భక్తిని ఫలముగాను జెప్పుచున్నది గాన భక్తి అంగియె యగును.

మూ. ప్రాగుక్తంచ.

సూ. ఈవిధముగా జ్ఞానమును అంగముగాను భక్తిని అంగిగాను ఇదివరలో గీతాదులలోఁ జెప్పఁబడెనుగూడ.

అ. బ్రహ్మాంబయి ప్రసన్నుండై, విచారింపఁడు గోరఁడు
సర్వభూతాలఁదుల్యుండై, మేలౌనాభక్తి నొందును.
(నా తెనుఁగు గీత ౧౮. ౫౪)

ఇందులో మొదట జ్ఞానమును సాధనమునుగాను భక్తిని పొందవలసిన దానినిగాను జెప్పఁబడెనని భావము.

మూ. ఏతేన వికల్పోఽపి ప్రత్యుక్తః

సూ. పోని జ్ఞానము భక్తులు రెండును ఒకప్పుడు అంగిగాను ఒకప్పుడు అంగముగాను అగునన్నచో అస ముచ్చయపద్ధతియును నిరసింపఁబడినదే యయినది.

మూ. దేవభక్తి రితరస్మిన్ సాహచర్యాత్ (శాం. ౧౮)

సూ. గురుభక్తితో సాహచర్యమువలన దేవభక్తియు ఇతర దేవుని విషయకమైన భక్తిని బోధించునదియగు.

'యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురౌ' ఎవనికి దేవునియందు గొప్ప భక్తి యుండునో ఎట్లనఁగా దేవునియందు వలె గురువునందును. (శ్వేతా. ౬. ౨౩) అను చోట గురుభక్తితో సాహచర్యముగా చెప్పఁబడుటలో దేవ భక్తియు ఇతర దేవతాభక్తిని బోధించునని భావము'

మూ. యో॰స్తూభయార్థ మపేక్షణాత్ ప్రయాజవత్.
(శాం. ౧౯)

సూ. జ్ఞానభక్తుల కుపకారకముగా అపేక్షించుటవలన ప్రయాజము వాజపేయాదులకును తత్కర్తదీక్షకును అంగమైనట్లు జ్ఞానభక్తులు రెంటికి యోగము అంగము.

యోగమనఁగా చిత్తవృత్తులను నిరోధించుట.

మూ. గౌణ్యాత్తు సమాధిసిద్ధిః (శాం. ౦)

సూ. గౌణభక్తిచేనైతే సమాధి సిద్ధించును. (యోగ. ౩)
'ఈశ్వరప్రణిధానాద్వా' ఈశ్వరధ్యానము వల్లనైనను ఆ సమాధి సిద్ధించును, అను యోగసూత్రములో చెప్పఁబడిన ధ్యానము సగుణభక్తిలోనిదే. దాని చేతనైతే సమాధికి సిద్ధికలుగునని భావము.

మూ. హేయా రాగత్వాదితిచేత్ న
ఉత్తమాస్పదత్వాత్ సంగవత్. (శాం. ౧)

సూ. 'విషయరాగము' యోగశాస్త్రములో చెప్పఁబడిన పంచక్లేశములలోనిది గాన హేయముగదా అన్నచో ఈ రాగము పరమేశ్వరుని నాశ్రయించినదగుటవలన సత్సంగమువలె గ్రాహ్యమె గాని కుసంగమువలె త్యాజ్యముగాదు.

మూ. తదేవ కర్మిజ్ఞానియోగిభ్య ఆధిక్యశబ్దాత్.

భక్తి సర్వశ్రేష్ఠము కనుకనే కర్ములకంటెను జ్ఞానులకంటెను యోగులకంటెను భక్తుఁడు శ్రేష్ఠుఁడని అధికశబ్దప్రయోగము వలనఁ దెలుపఁబడెను.

"తపస్విభ్యోఽధికో యోగీ, జ్ఞానిభ్యోఽపి మతోఽధికః, కర్మిభ్యశ్చాధికో యోగీ, తస్మాద్యోగీ భవార్జున" 'యోగి తపస్వులకంటెన్,

జ్ఞానులకంటె శ్రేష్ఠుఁడు, కర్మిష్ఠులకంటె శ్రేష్ఠుఁ, డందుచేఁ గమ్ము యోగివి॥ 'యోగినామపి సర్వేషాం, మద్గతే నాంతరాత్మనా శ్రద్ధా వాన్ భజతే యోమాం, సమేయుక్తతమోమతః

(గీత. ౬. ౪౭. ౪౭)

"అందఱు యోగులలోనన్ నన్నుఁబొందుమనస్సుతో
శ్రద్ధతోఁగొల్చునెవ్వాఁడు, వాఁడే యోగివరుండగున్"

(నా తెనుఁగుగీత ౬, ౪౭, ౪౭.)

సూ. ప్రశ్న నిరూపణాభ్యా మాధిక్యసిద్ధేః (శా. ౨౩)

సూ. అర్జునుని ప్రశ్నచేతను భగవానుని నిరూపణము చేతను భక్తికి ఆధిక్యము సిద్ధించుట వలన భక్తియే శ్రేష్ఠము.

ప్రశ్న నిరూపణములచేత పంద్రెండవ యధ్యాయములో భక్తి సర్వశ్రేష్ఠమని గీతలోఁ జెప్పఁబడెనని భావము.

సూ. నైవశ్రద్ధాతు సాధారణ్యాత్ (శా. ౨౪.)

సూ. శ్రద్ధయైతే భక్తిరూపమైనది కానేకాదు. అది కర్మాదులకు సాధారణ గుణమైనది.

ఈశ్వర భక్తిమాత్రము అట్టిదిగాదని భావము.

సూ. తస్యాం తత్త్వే చానవస్థానాత్. (శా. ౨౫.)

సూ. శ్రద్ధయందు భక్తిత్వమున్నదన్నచో అనవస్థాదోషము పట్టును.

"శ్రద్ధావాన్ భజతేయోమాం" శ్రద్ధగల యెవ్వఁడు నన్ను భజించునో. గీత. అని శ్రద్ధ భక్తికి అంగమని చెప్పఁబడెను. ఆ శ్రద్ధ భక్తియు ఒకటేయన్నచో అంగమైన శ్రద్ధయనఁగా నేమి, అదియు భక్తియే యైనచో దానికి ఇంకొక శ్రద్ధ అంగమని దానికి ఇంకొక

శ్రద్ధ యంగమని యిట్లు అనంతముగా, చెప్పవలసి వచ్చును గాన అనవస్థాదోషము పట్టును. అందుచే శ్రద్ధయు భక్తియు ఒకటిగావు

సూ. బ్రహ్మకాండంతు భక్తౌ తస్యాను జ్ఞానాయ సామాన్యాత్ (శా. ౨౬)

సూ. శ్రుతిలోఁ జెప్పఁబడిన బ్రహ్మకాండము భక్తివిషయక మైనది. బ్రహ్మకాండము అజ్ఞాతవిషయమును దెలుపునట్లె మిగిలిన రెండు కాండములు అజ్ఞాత విషయమునె తెలుపుటలో సమానమె కాన అవి జ్ఞానమునె తెలుపుచున్నవనరాదు.

ఇంతమాత్రము చేతనే దానిని జ్ఞానకాండమని యన్నచో ధర్మ జ్ఞానమును గలిగించు కర్మకాండమును గూడ జ్ఞానకాండమని యన వలసివచ్చును. భక్తిని దెలుపుటకై ఆరంభింపఁబడుటచే బ్రహ్మకాండ మును భక్తికాండమనియె యనవలయునని భావము.

సూ. బుద్ధిహేతు ప్రవృత్తి రావిశుద్ధే రవఘాతవత్. (శా. ౨౭)

సూ. బియ్యమునుండి పొల్లు విడిపోవు వఱకు ఱోఁకలిపోటు అవసరమైనట్లు అంతఃకరణము విశుద్ధమగునంతవఱకు బ్రహ్మజ్ఞానము నకుఁ గారణములైన శ్రవణమననాది సాధనములు మాటిమాటికి ఆచరించుచునే యుండవలయును.

సూ. తదంగానాంచ (శా. ౨౮.)

సూ. శ్రవణమననాదులకును అంగములైన గురుసేవయు, శాస్త్రవిచారము, శమదమాది సాధనలనుగూడ అంతఃకరణశుద్ధి యగు నంత వఱకు చేయుచునేయుండవలెను.

సూ. భవతు నిశ్చయదార్ఢ్యా దూర్ధ్వం శాస్త్రరక్షణం. (నారద. ౧౨.)

సూ. పరమేశ్వరునియందు అచంచల ప్రేమగలిగినపిదపఁగూడ శాస్త్రరక్షణచేసి శాస్త్రోక్త కర్మను ఆచరించుచునె యుండవలయును.

"శాస్త్రంబది ప్రమాణంబు కార్యాకార్య వివేచనన్ కాన శాస్త్రోక్తముం దెల్సి, కర్మలు చేయఁగాఁదగున్" అని గీత. (౧౬. ౨౪.)

సూ. అన్యథా పాతిత్య శంకయా.

సూ. శాస్త్రోక్త కర్మను పాలింపకున్నచో ఆ భగవత్ప్రేమ నుండి పడిపోవుట సంభవించును.

"శాస్త్ర విధిన్ విడియెవం, డాశకు లొంగిచేయునో వాఁడు సిద్ధిని పొందఁడు సద్గతిన్ సౌఖ్యమొందఁడు. (తె. గీత. ౧౬. ౨౩.)

సూ. లోకోఽపితావదేవ కింతు భోజనాదివ్యాపారస్త్వాశరీరావధి. (నారద. ౧౪.)

సూ. లౌకికకర్మకూడ (వైదికకర్మతోపాటు) బాహ్యవిషయక జ్ఞాన మున్నంతవఱకె. కాని భోజనాది వ్యాపారమైతే శరీరమున్నంత వఱకు నుండును.

(ఇది రెండవ ప్రకరణము)

---:0:---

భక్తితత్త్వ దర్శనము

## మూఁడవ ప్రకరణము

### భక్తి లక్షణములు

సూ. తల్లక్షణాని వాచ్యంతే నానామత భేదాత్.

(నారద. ౧౫.)

సూ. ఆయా మహర్షుల మతభేదము ననుసరించి భక్తికి లక్షణములు చెప్పఁబడుచున్నవి.

**సూ. పూజాదిష్వనురాగ ఇతి పారాశర్యః.** (నార. ౧౬.)

సూ. దైవార్చనాదులందు అనురాగమె భక్తియని వ్యాసుఁడనియె.

"శ్రీ విష్ణో రర్చనం యేతు ప్రకుర్వంతి నరా భువి, తే యాంతి శాశ్వతం విష్ణోరానందం పరమంపదం" (విష్ణురహస్య)

"ఏ మనుష్యులు శ్రీ విష్ణువును అర్చింతురో వారు శ్రీ విష్ణువు యొక్క శాశ్వతానందరూపమైన పరమపదమును పొందుదురు".

సూ. కథాదిష్వితి గార్గః (నార. ౧౭.)

సూ. దైవ కథలందు అనురాగమె భక్తియని గార్గుఁడు.

సూ. ఆత్మ రత్యవిరోధేనేతి శాండిల్యః. (నార. ౧౮.)

సూ. ఆత్మానందమునకుఁ బ్రతికూలముగాని విషయములందు అనురాగము భక్తియని శాండిల్యుఁడు.

### భక్తి లక్షణములు

సూ. నారదస్తు తదర్పితాఖిలాచారితా తద్విస్మరణే పరమ వ్యాకులతేతి. (నార. ౧౯.)

సూ. నారదుఁడైతే భగవంతునికిఁ దనసమస్త కర్మలను అర్పించుచు ఆ భగవంతుని విస్మరించినచో మిగుల వ్యాకులత్వమును పొందుటయె భక్తియనెను.

"కావున నెల్ల వేళల, నన్ స్మరింపుము పోరుమీ" నా కర్పింప మనో బుద్ధుల్, నన్నుఁగాంతు వవశ్యమున్.

(నా తెనుఁగు గీత ౮. ౭)

సూ. అస్త్యేవ మేవం. (నార. ౨౦)

సూ. ఇందుకీవిధమైన నిదర్శనములున్నవి.

సూ. యథావ్రజగోపికానాం. (నార. ౨౧)

సూ. గొల్లపల్లెలోని గోపికల భక్తి యిట్టిదె.

పాయని గేహశృంఖలలఁ బాసి నిరంతర మత్పరత్వముం జేయుచునున్న మీకుఁ బ్రతిసేయయుగంబులనైన నేరనన్ బాయకగొల్చు మానసము ప్రత్యుపకారముగాఁ దలంచి నాపాయుట దప్పుగాఁ గొనక భామినులార! కృపన్ క్షమింపరే.

(భాగ. ౧౦. పూ. ౧౦౮౨)

శా. రమ్మాయుద్ధవ! గోపకామినులు నారాకన్ నిరీక్షించుచున్
సమ్మోహంబున నన్నియున్ మఱచియే చందంబునంగుందిరో
తమ్మున్ నమ్మినవారిడిగ్గవిడువన్ ధర్మంబుగాదంద్రు తే
హమ్మా ప్రాణములేక్రియన్ నిలిపిరో ప్రోద్యద్వియోగాగ్నులన్

కం. లౌకిక మొల్లకనన్నా
లోకించు ప్రసన్నులకును లోఁబడి కరుణా
లోకనములఁ బోషింతును
నాకాశ్రితరక్షణములు నైసర్గికముల్.

(భాగ. ౧౦ పూ. ౧౪ ౩౮)

ఉ. పాపపుబ్రహ్మ గోపికల పల్లెలలోన సృజింపరాదె ము
న్నీ పురిలోపలన్ మనలనేల సృజించెనటైన నిచ్చలున్
జేపడుఁగాదె యాసుభగుఁ జెందెడి భాగ్యము సంతతంబు నీ
గోపకుమారుఁ బొందఁ మును గోపకుమారికలేమినోచిరో

కం. గోపాలకృష్ణుతోడను, గోపాలనవేళలందుఁ గూడితిరుగునా
గోపాలు రెంతధన్యులో, గోపాలురకైన నిట్టి గురు రుచిగలదే.
(భాగ. ౧౦. పూ. ౧౩౫౭)

సూ. తత్రాపి నమాహాత్మ్యజ్ఞాన విస్మృత్యపవాదః (నార. ౨౨)

సూ. గోపికల భక్తివిషయములోఁ గూడ 'గోపికలకు భగవంతునియందుఁ గేవల ప్రేమయేగాని భగవంతుని మాహాత్మ్యజ్ఞాన విస్మృతియుండునని యపవాదము చెప్పరాదు.

మ. పతులన్ బిడ్డల బంధులన్ సతులకుం బాటించుటే ధర్మప
ద్ధతి యానంటివి దేహధారిణులకున్ ధర్మజ్ఞ ! చింతింపుమీ
పతిపుత్రాదిక నామమూర్తివగుచున్ భాసిల్లు నీయందుఁ ద
త్పతి పుత్రాదిక వాంఛలన్ జలిపి సంభావించు టన్యాయమే.
(భాగ. ౧౦. పూ. ౯౯౦)

ఇందులో గోపికలకు శ్రీకృష్ణుఁడు పతిపుత్రాది సర్వస్వరూపుఁ డను జ్ఞానస్మృతి గలదని తోఁచుచున్నది ఇట్లే,

ఆ. వె. సవతులేక నీవిశాలవక్షస్స్థలిఁ
దులసితోడఁ గూడఁ దోయజాక్ష !
మనువు మనుచు నెపుడు మాకాంత నీ పాద
కమలరజముఁ గోరుఁగాదె కృష్ణ. మొ.
(భాగ. ౧౦. పూ. ౯౯౪)

కం. అమరులఁ గాచిన హరిక్రియఁ
గమలేక్షణ నీవు నేఁడు కరుణ నభయ హ
స్తము మూయురముల శిరములఁ
బ్రమదంబున నిడుము మూర్ఛపాల్పడకుండన్.

(భాగ. ౧౦. పూ. ౧౦౦౨)

కం. కిటియై కౌగిటఁ జేర్చెను
వటుఁడై వర్ధిల్లికొలిచె వడిఁ గృష్ణుండై
యిట్టఁబడ చిహ్నములిడి గ్రిం
దటి జామున నేమినోచితమ్మధరిత్రీ!

(భాగ, ౧౦౨౦)

సూ. తద్విహీనం జారాణామివ (నార. ౨౩)

సూ. భగవంతుఁడితఁడు అనుజ్ఞానము లేకుండఁ జేయునట్టి యిటు వంటి ప్రేమ జారుల ప్రేమవంటి దేయగును.

సూ. నాస్త్యేవతస్మింస్తత్సుఖ సుఖత్వం (నార. ౨౪)

సూ. జారుల ప్రేమలోఁ గేవలము తమ సుఖముసంగతి చూచు కొనుటయెగాని తమకుఁ బ్రేమాస్పదుఁడగువారు సుఖింపఁగా వారి సుఖమును చూచి సుఖించుట యనునది యెప్పుడును ఉండదు.

గీ. ఘోషభూమి వెడలి గోవుల మేపంగ
నీరజాక్షమైన నీ పదములు
గసవు శిలలు దాఁకి కడునొచ్చునో యని
కలఁగు మా మనములు కమలనయన!

(భాగ. ౧౦. పూ. ౧౦౯)

ఇట గోపికలు కృష్ణుని దుఃఖమునకు దుఃఖించుటవల్ల వారి ప్రేమ నిర్మలము.

సూ. సాతు కర్మజ్ఞాన యోగేభ్యోప్యధికతరా. (నార. ౨౫)

సూ. ఆ భక్తియైతే కర్మజ్ఞానయోగములకంటెఁగూడ మిగల శ్రేష్ఠమైనది.

వేదాలచేఁ దపసుచే, దానంబుచేత నిష్టిచే
ఇట్టినేనుగనన్ రాను. నీవిపు డు చూచినట్లుగా.
అనన్యభక్తిచేతనె, సరిగా నీదృశున్ నమున్
దెలియఁజూడఁ జేరఁగ, శక్యంబుసుమ్మి ఫల్గునా,
(నా తెనుఁగుగీత ౧౧. ౫౩. ౪)

సూ. ఫలరూపత్వాత్ (నార. ౨౬)

సూ. కర్మజ్ఞానాదులు భగవత్ప్రాప్తిసాధనములును భక్తిఫల రూపమును గాన ఆ భక్తియె శ్రేష్ఠమైనది

సూ. ఈశ్వరస్యాప్యభిమాన ద్వేషిత్వాత్ దైన్య ప్రియత్వాచ్చ. (నార. ౨౭)

సూ. ఈశ్వరుఁడు (మేమింతవారమని) కర్మాద్యభిమానముగల వారిని ద్వేషించువాఁడగుటవలనను సర్వము దేవునికర్పించి దీనులగు వారి దైన్యమందు ప్రియముగలవాఁడగుట వలనను భక్తియె శ్రేష్ఠము.

"భగవంతునికి ఎవరియందు ద్వేషప్రేమాతిభావములుఉండవు. కాని కర్మాదులందు అభిమానముగలవారిని ద్వేషించుట ద్వారాను సర్వము దేవునికర్పించి మాకు దేవుఁడే దిక్కు అను దీనులయందు ప్రేమ

చూపుట ద్వారాను జీవులను ఉద్ధరించును". కేవల కర్మాభిమానులపై ద్వేషలీలలు, దాసులపై ప్రేమలీలలు చూపునని తెలియునది.

"సాధనాలెవ్వి లేకుండి, సర్వదా మాయచేఁబడి
పాపాలనిండి దీనుఁడా, నాకనుగ్రహ్ముఁడే గతి".

సూ. తస్యా జ్ఞానమేవ సాధనమిత్యేకే (నార. ౨౮.)

సూ. ఆ భక్తికి జ్ఞానమే సాధనమని యొక్కరు,
జటాయువు, గజేంద్రుఁడు, ధ్రువుఁడు శబరి మొదలగువారు జ్ఞానము లేకుండఁగూడ భగవంతుని బొందిరి.

సూ. అన్యోన్యాశ్రయత్వమిత్యన్యే (నార. ౨౯.)

సూ భక్తిని జ్ఞానము జ్ఞానమును భక్తి పరస్పరము ఆశ్రయించి యుండునని యితరులు.

సూ. స్వయం ఫలరూపతేతి బ్రహ్మకుమారాః. (నార. ౩౦.)

సూ. భక్తి స్వయముగనె ఫలరూపమైనదని సనత్కుమారాది బ్రహ్మకుమారులనిరి.

సూ. రాజగృహభోజనాదిషుత్ తథైవదృష్టత్వాత్.
(నార. ౩౧.)

సూ. రాజగృహనివాస, భోజనాదులు ఫలరూపముగనె కనిపించుట వల్ల ఇదియు ఫలరూపమైనదే.

సూ. న తేన రాజపరితోషః క్షుధా శాంతిర్వా (నార. ౩౨.)

సూ. కేవలము రాజులసంగతి తెలిసికొనుటవల్ల రాజుల సంతోషమును, భోజనాదులను వినుటవల్ల ఆకలి శాంతించుటయును గలుగదు గదా.

"సర్వభూతాలయందుల్యుండ, నాకు లేరు రిపుల్ ప్రియుల్.
భక్తితోఁ గొల్చువారిలో, నేనుందు వారునాయెడన్".
(నా తెనుఁగుగీత. ౯. ౨౯.)

సూ. తస్మాత్సైవ గ్రాహ్యా ముముక్షుభిః. (నార. ౩౩)

సూ. కనుక అదే ఆ భక్తియె ముముక్షువులచే గ్రహింపఁదగినది.

ఇది మూఁడవ ప్రకరణము.



# భక్తితత్త్వదర్శనము

## నాల్గవ ప్రకరణము

### భక్తి సాధనములు

సూ. తస్యాఃసాధనాని గాయంత్యాచార్యాః. (నార. ౩౪.)

సూ. ఆ భక్తికి కొన్ని సాధనములను ఆచార్యులు చెప్పుచున్నారు.

సూ. తత్తు విషయత్యాగాత్ సంగత్యాగాచ్చ. (నార. ౩౫.)

సూ. ఆ భక్తిసాధనమైతే విషయ భోగత్యాగమువల్లను ధన పుత్రాది సంగత్యాగమువల్లను సిద్ధించును.

గీ. విషయములను ధ్యానించుచు వెలయు నరుని
చిత్తమది విషయములలోఁ జిక్కుకొనును
నన్ను ధ్యానించుచుండెడి నరుల మనసు
వేగ నాయందె లీనమై వెలయుచుండు.

(భాగ. నా యనువాదము)

"వీతరాగులైన సనకాదులనుధ్యానించిన మనస్సు వీతరాగమై కాముకులను ధ్యానించినఁ గాముకమైయుండును" అని

(నా యోగసూత్రము. సమాధి. ౩౭.)

"విషయంబుల ధ్యానించు, ప్రాణులకందె ప్రీతియౌ
ప్రీతిచేఁ గోర్కెపుట్టును, గోర్కెచేఁబుట్టుఁ గ్రోధమున్
క్రోధంబుచేత మోహంబౌ, మోహంబుచే స్మృతుల్ చెడున్
స్మృతిపోవన్ మతిపోవున్, మతిపోవన్ క్షయంబెయౌ.

(నా తెనుఁగుగీత. ౨. ౬౨. ౬౩.)

సూ. అవ్యావృత్త భజనాత్. (నార. ౩౬.)

సూ. ఎడతెగకుండఁ జేయు భగవద్భజనవలనను ఆ భక్తిసాధనము సిద్ధించును.

"నిత్యమనన్యచిత్తుండై, నన్నెవ్వఁ డెప్పుడెంచునో
యా నిత్యశుద్ధుఁడౌ యోగి, కేను లభింతు సులువుగా.
(నా తెనుఁగుగీత ౮. ౧౪.)

సూ. లోకేఽపి భగవద్గుణ కీర్తనాత్ (నార. ౩౭.)

సూ. లోకములందును భగవంతుని గుణములను విని కీర్తించుట వలనను ఆ భక్తి సిద్ధించును.

సీ. సకలగుణాతీతు సర్వజ్ఞు సర్వేశు
నఖిలలోకాధారు నాదిదేవుఁ
బరమదయా రసోద్భాసితుఁ బ్రిదశాభి
వందిత పాదాబ్జు వనధిశయను
నాశ్రితమందారు నాద్యంతశూన్యుని
వేదాంతవేద్యుని విశ్వమయుని
గౌస్తుభ శ్రీవత్స కమనీయ వక్షుని
శంఖచక్రగదాసి శార్ఙ్గధరుని

గీ. శోభనాకారుఁ బీతాంబరాభిరాము
రత్నరాజిత మకుట విభ్రాజమానుఁ
బుండరీకాక్షు మహనీయ పుణ్యదేహుఁ
దలఁతు నుతియింతు దేవకీతనయు నెపుడు,

(భాగ. ౧-౨. ౫౦.)

ఇత్యాదికముగఁ గీర్తించుటవలన భక్తి సిద్ధించును. పరమేశ్వరుని నెట్లు కీర్తించినను సరే భక్తిముక్తులు గల్గును

"బిడ్డ పేరుపెట్టి పిలుచుట విశ్రామ
కేళినైన మిగులఁ గేళినైనఁ
బద్యగద్యగీత భావార్థములనైనఁ
గమలనయనుఁ దలఁపఁ గలుషహరము. (భాగ. ౬. ౧౨౨.)

'ఉ' ఆరయ వీర్యవంతమగు నౌషధమెట్లు యదృచ్ఛఁగొన్నఁద
చ్చారుగుణంబురోగములఁ జయ్యనఁబాపెడు మాడ్కిఁబుణ్యవి
స్తారుని నంబుజోదరునిఁ బామరుఁడజ్ఞుఁడవజ్ఞఁ బల్కినన్
వారకతత్త్వభావము ధ్రువంబుగ నాత్మగుణంబుఁ జూపదే.

అజామిళుఁడసలు భక్తుఁడే. కావుననే కొడుకుకు నారాయణుఁడని భగవంతుని పేరుపెట్టెను ప్రమాదముచే దుష్టుఁడయ్యెను. అయినను కొడుకు పేరుద్వారా నారాయణనామమును స్మరింపమాన లేదు. చివరకూడ ఆ నామమే పలికెను. ఆ పరమేశునామము కొడుకునకుంచుట ఔషధమును సరిగా చేయుటవంటిదే. మందు మ్రింగుట అనగా ఆ నామస్మరణమే. మధ్యగా దోషములుచేసినను మొదట మందువేసికొనకపోయినను చివరసారి మందువేసికొనెను. భగవంతుని నామమును స్మరించెను. కమలనయను ధ్యానించెను. చివరిసారి స్మరణకు ఏది వచ్చిన ఆఫలితమే కలుగును. అసలు చివరిసారి స్మృతిలోనికి వచ్చుటకే మొదటినుండి భగవంతుని స్మరణాభ్యాసము చేయుట. కొందఱు మొదటిలో స్మరించుచున్నను వారికిమనస్సులో అణఁగియున్న కోరికలు చివరికివచ్చి భగవంతుని దలంపనీయవు. కొందఱ మనస్సు కేవలము భగవదధీనమైనను ఏదో పొరపాటువలన దోషసహితమగును.

ఆ పొరపాటును చివర గ్రహించి ప్రశ్చాత్తాపముచే ఆ దోషమును కడిగివైచుటచే నిర్మలమైన మనస్సు చివర భగవంతునిస్మరించి ముక్తి పొందును. ఇట్లే లీలాశుకాదులును ముక్తిపొందినారని తెలియు చున్నది. అని గ్రహింపవలెను. ఇతరులకు పైపైకి కనుపించునవే తెలియునుగాని దుష్టుఁడుగా పైకి గనుపించువానిలో నున్న పశ్చాత్తా పాదులు కనిపింపవు. కాన వానిని దుష్టుఁడని జనులు అనుకొందురు భగవతుండు సర్వజ్ఞుఁడను లోన పైన చూచువాఁడునుగాన వానికి ఆదుష్టుఁడనుకొనఁబడు వానిలో నున్న భక్త్యాదులలోని నిజస్వరూపము తెలియును గాన వానిని ఉద్ధరించవలెనని తలఁచి ఉద్ధరించును. అని అజామిళోపాఖ్యానము లోని రహస్యభావము గ్రహింపదగును.

కనుకనే అజామిళునికి విష్ణుసన్నిధి కలిగినది. (భాగ. ౬. ౧౨౬.)

సూ. ముఖ్యతస్తు మహత్కృపయైన భగవత్కృపాలేశాద్వా. (నార. ౩౮.)

సూ. ప్రధానముగా మహాపురుషులదయచేతనే భక్తి సిద్ధించును. భగవంతుని కృపాలేశము వలనఁగాని సిద్ధించును.

నారదాది మహాపురుషుల దయచేఁ బ్రహ్లాద ధ్రువాదులకు భక్తి సిద్ధించినదనియు అంబరీష నారదాదులకు భగవంతుని దయచే భక్తి సిద్ధించినదనియు తెలియవలెను.

సూ. మహత్సంగస్తు దుర్లభోఽగమ్యో అమోఘశ్చ (నార. ౩౯.)

సూ. మహాపురుషుల సాంగత్యము దొరకుట కష్టము. సాంగత్యము దొరకినపిదప వారితోఁ గలిసిపోవుట కష్టము. అట్లు గలిసి పోయినచో అది అమోఘమైనది.

సూ. లభ్యతేఽపి తత్కృపయైవ. (నారద ౪౦.)

సూ. మహాపురుష సాంగత్యముకూడ భగవంతుని దయచేతనే లభించును.

సూ. తస్మింస్తజ్జనే భేదాభావాత్ (నారద. ౪౧.)

సూ. భగవంతునియందు భగవద్భక్త జనమందు భేదము లేకపో వుటవలన భక్తులకు అది లభించును.

కం. సాధుల హృదయము నాయది;
సాధుల హృదయంబునేను జగముల నెల్లన్;
సాధులనేన యెఱుంగుదు
సాధు లెఱుంగుదురు నాదు చరితము విప్రా !
(భాగ. ౯. ౧౩౩.)

"మన్మాహాత్మ్యం మత్సపర్యాం, మచ్ఛ్రద్ధాం మన్మనోగతం
జానంతి గోపికాః పార్థ నాన్యేజానంతితత్త్వత॥

గీ. నాదు మాహాత్మ్యమును మఱి నా సపర్య
నాదు శ్రద్ధను నా మదిన్ గలుగుదాని,
నెల్లముగ గోపికలె పార్థ తెలియువార.
లితరులో తత్త్వముగ దాని నెఱుఁగలేరు.

"భక్తితోఁ గొల్చువారిలో, నేనుందు వారు నాయెడన్"
(నా తెనుఁగు గీత. ౯. ౨౯.)

సూ. తదేవ సాధ్యతాం తదేవసాధ్యతాం. (నారద౭. ౪.)

సూ. దానినే సాధింపవలెను. దానినే సాధింపవలెను.

(ఇది నాల్గవ ప్రకరణము)

—:—

# అయిదవ ప్రకరణము

## భక్తికి పరమేశ్వరుఁడు ఆశ్రయము

సూ. తామైశ్వర్యపరాం కాశ్యపః పరత్వాత్. (శా. ౨౯.)

సూ. ఈశ్వరుఁడు అందరికంటె గొప్పవాఁడు కనుక బుద్ధి పరమేశ్వరుని ఆశ్రయించినచో అది ఐశ్వర్య (మోక్ష) దాయిని యగునని కాశ్యపుఁడు చెప్పెను.

ఈ మతములో జీవాత్మయుఁ బరమాత్మయును వేఱువేఱుగానున్నవని భావము.

సూ. ఆత్మైకపరాం బాదరాయణః (శా. ౩౦.)

సూ. ఆ బుద్ధిని ఆత్మైకపరముగాఁ జేయవలయునని వ్యాస మహర్షి యనెను.

ఈ మతమున జీవాత్మ పరమాత్మలకు భేదము కల్పితముకాని వాస్తవముగాదని భావము.

సూ. ఉభయపరాం శాండిల్యశ్శబ్దోపపత్తిభ్యాం. (శా. ౩౧.)

సూ. వేదప్రమాణమును బట్టియు, యుక్తినిబట్టియు ఆ బుద్ధి జీవాత్మ పరమాత్మలు రెండిటిపరమైనదని శాండిల్యుఁడనియెను.

''సర్వంఖల్విదంబ్రహ్మ, తజ్జలానితి శాంత ఉపాసీత'

గీ. ప్రకటమగు ప్రపంచమందెల్ల బ్రహ్మమయము
అఖిల మీ ప్రపంచము బ్రహ్మమందుఁబుట్టి

బ్రహ్మమున లయించియు బ్రహ్మవలన బ్రతికి
యెసఁగునని శాంతుఁడై యుపాసింపవలయు
(నా యుపనిషత్సుధ ఛాం. ౧౪. ౧.)

గీ॥ నా హృదయములోపలను నున్నదియు యాత్మ
ఇదియె బ్రహ్మ. యీ మెయినుండి యేగి బ్రహ్మఁ
గనుదు ననువానిపల్కు నిక్కము దృఢంబు
నిటుల శాండిల్యుఁడనియె శాండిల్యుఁడనియె.
(నా యుపనిషత్సుధ)

అనునది వేద ప్రమాణము. "యతో వా ఇమాని భూతాని జాయంతే"
ఎందుండి భూతంబు లివియెల్లఁబుట్టునో పుట్టియు దేనిచేఁ బ్రతికెందు.
(నా యుపనిషత్సుధ) (తై. భృగు ౧.)

"పూర్వుఁడై జీవులందుండు, జీవుండు నాదునంశమే.
(నా తెనుఁగుగీత ౧౫ ౭.)

అనువానిలో బ్రహ్మము పరమేశ్వరరూపముగను, జీవరూపముగను
వర్ణితము కాన రెండునగునని యుక్తి.

మూ. నచక్లిష్టః, పరః స్యాదనంతరం, విశేషాత్(శా ౩౩)

సూ. ఈశ్వరుఁడు క్లేశసహితుఁడుగాఁడు. జీవుఁడు చైతన్యాంశనుబట్టి యభిన్నుఁడని నిర్ణయించిన యనంతరము గూడ జీవునికి క్లేశాదులుండును. ఈ విశేషమును బట్టి జీవాత్మ పరమాత్మకంటె అభిన్నుఁడు గాఁడు.

మూ. ఐశ్వర్యంతథేతిచేన్న. స్వాభావ్యాత్. (శా. 34)

సూ. పరమేశ్వరునియందుఁ గ్లేశాదులుండవన్నచో ఐశ్వర్యమును ఉండదన్నచో అట్లనరాదు. ఆ యైశ్వర్యముండుట పరమేశ్వరునికి స్వభావమగుటవలన అది యుండును.

మూ. అప్రతిషిద్ధం పరైశ్వర్యం తద్భావాచ్చ, నైవమితరేషాం. (శా. 35)

సూ. ఐశ్వర్యముండుటవలనను శ్రుతులలో ఎక్కడను పరమేశ్వరునికి ఐశ్వర్యము లేదని ప్రతిషేధింపఁబడలేదు. ఇట్లే బ్రహ్మత్వముండుటవలన ఇతర జీవులకును క్లేశములుండుట స్వాభావికము గాదు ఆగంతుకమే.

మూ. సర్వాన్నృతే కిమితిచేన్న. ఏవంబుద్ధ్యానంత్యాత్. (శా. 36.)

సూ. సర్వము అనృతమైనపుడు (జీవులన్ని ముక్తులగును గాన) ఇంక ఈశ్వరుని యైశ్వర్యమువలనఁ బ్రయోజనమేమి అన్నచో అట్లనరాదు. బుద్ధిజీవులనంతముగాన వాని రక్షణకై అది ప్రయోజనకరమగును.

మూ. ప్రకృత్యంతరాళా దవైకార్యం చిత్సత్త్వే నానువర్తనాత్. (శా. 32)

ప్రశ్న : ఈశ్వరునియందు కర్తృత్వరూపమైన యైశ్వర్యమున్నదన్నచో అతఁడు వికారియగును అన్నచో—

సూ. ప్రకృతిని మధ్యగాఁ బెట్టుకొనుటవలన. (ప్రకృతికేకాని) ఈశ్వరునికి వికారము లేదు. ఆ యీశ్వరుఁడె చైతన్య సత్తతో

(ప్రకృతియందు) అనుసరించుట వలన అతనికి కర్తృత్వరూపమైన వైశ్వర్యమున్నను వికారము మాత్రము లేదు.

మూ. తత్ప్రతిష్ఠా గృహపీఠవత్ (శా. ౩౮.)

సూ ఇంటిలోని పీటయందున్న వానిని గృహమునందున్నాఁడని యనినట్లు ప్రకృతియందున్న ప్రపంచము ను ఈశ్వరునియం దున్నట్లు చెప్పవచ్చును.

"తస్మిన్ సర్వం ప్రతిష్ఠితం" ఆ యీశ్వరునియందు సర్వము ఉన్నది. అనునది పైని సూత్రమునందు జెప్పఁబడినట్లు కుదురునని భావము.

మూ మిథోఽపేక్షణా దుభయం     (శా. ౩౯.)

సూ, సృష్టికార్యముతో బ్రహ్మము ప్రకృతి రెండును అపేక్షించుటవలన రెండును సృష్టికిఁగారణములె.

మూ. చైత్యచితోర్న తృతీయం.     (శా. ౪౦ )

సూ. జ్ఞేయముకంటెను జ్ఞాతకంటెను మూఁడవ వస్తువు లేనేలేదు.

మూ. యుక్తౌచ సంపరాయాత్     (శా. ౪౧ )

సూ. అనాదికాలమునుండి యా ప్రకృతి పురుషులిద్దఱు పరస్పరము కలిసియున్నారు.     (శా. ౪౨.)

"ప్రకృతియున్ బురుషుండు, ననాదులని యెఱుంగుమీ"

(నా తెనుఁగుగీత. ౧౩. ౧౯.)

మూ. శక్తిత్వాన్నానృతం వేద్యం. (శా. ౪౨.)

సూ. వేద్యమగు ప్రకృతి పరమేశ్వరుని శక్తియగుటవలన మిథ్యకాదు.

మూ. తత్పరిశుద్ధిశ్చ గమ్యా లోకవ ల్లింగేభ్యః (శా. ౪౩.)

సూ. ఆయా పులకాంకురాది చిహ్నములనుబట్టి లోకమందు ప్రీతిని దెలిసికొనునట్లు పులకాంకురాది చిహ్నములనుబట్టి భక్తియొక్క పరిశుద్ధి యూహింపఁదగినది.

॥సీ॥ వైకుంఠచింతా వివర్జిత చేష్టుఁడై
యొక్కఁడు నేడుచు నొక్కచోట
నశ్రాంత హరిభావనారూఢ చిత్తుఁడై
యుద్ధతుఁడై పాడునొక్కచోట
విష్ణుఁడింతియకాని వేఱొండు లేదని
యొత్తిలినగుచుండు నొక్కచోట
నళినాక్షుఁడను నిధానముగంటి నేనని
యుబ్బి గంతులువైచు నొక్కచోట,

॥గీ॥ బలుకు నొక్కచోట, బరమేశుఁ గేశవుఁ
బ్రణయ హర్ష జనిత బాష్పసలిల
మిళిత పులకుఁడై నిమీళిత నేత్రుఁడై
యొక్కచోట నిలిచి యూరకుండు, భా. ౭

ఇటుఁ బ్రహ్లాదుఁడు మహాభక్తుఁడని తత్తచ్చేష్టలఁబట్టి తెలియుచున్నది.

మూ. సమ్మాన, బహుమాన, ప్రీతి, విర, హేతరవిచికిత్సా, మహిమఖ్యాతి, తదర్థప్రాణస్థాన, తదీయతాసర్వ, తద్భావాఽప్రతి కూల్యానిచ స్మరణేభ్యో బాహుళ్యాత్    (శాం. ,)

సూ. స్మృతులవలన నెక్కువగా తోఁచుటవలన సమ్మానము బహుమానము. ప్రీతి, విరహము, ఇతరములందుఅరుచి, మహిమఖ్యాతి, భగవదర్థ ప్రాణధారణము, స్వవస్తు సర్వార్పణబుద్ధి, సర్వవస్తు భగవద్భావనము, భగవంతునియెడల ప్రాతికూల్యము లేకుండుట అనునవి యును భక్తికిఁ జిహ్నములె.

సమ్మానము:- కృష్ణునిని అర్జునాదులవలె సమ్మానించుట బహుమానము:- ఇక్ష్వాకులకువలె భగవత్సదృశనామాదులందు గౌరవము. ప్రీతి:- కృష్ణునియందు కృష్ణభక్తులందు విదురాదులకువలె ప్రీతి. విరహము:- శ్రీకృష్ణునిపై గోపికలకు వలెఁ గలిగిన విరహము. ఇతరారుచి:- ఉపమన్యువునకువలె శ్వేతద్వీపవాసులకువలె భగవద్భిన్న వస్తువులందు రుచిలేకపోవుట. మహిమఖ్యాతి:- భీష్మవ్యాసాదులకు వలె నిరంతరము భగవంతుని మహిమలను వర్ణించుట. భగవదర్థ ప్రాణధారణ:- హనుమంతునికివలె, గోపికలకువలె భగవంతునికొఱకై ప్రాణములను ధరించియుండుట. స్వవస్తు సర్వార్పణబుద్ధి:- బలికివలె సర్వస్వార్పణబుద్ధి. సర్వవస్తు భగవద్భావనము:- ప్రహ్లాదునికి వలె సర్వమందు భగవద్దృష్టి. భగవదప్రాతికూల్యము:- భీష్మయుధిష్ఠిరాదులవలె భగవంతునికి ప్రతికూలమైన పనులు చేయకుండుట.

మూ. ద్వేషాదయస్తు నైవం.    (శా. ౪౫.)

సూ. ద్వేషాదులైతే భక్తిచిహ్నములుగావు.

ఇదివరలోఁ జెప్పఁబడిన "బాంధవమునసైన వగసైన పగసైన" అనుదానిని బట్టి యీ సూత్ర విషయము లోకులలోఁ బరస్పరము రాగ ద్వేషాదుల విషయముగాఁ దెలియవలయును.

మూ. తద్వాక్యశేషాత్ ప్రాదుర్భావేష్వపిసా. (శా. ౪౮.)

సూ. భగవంతుని ప్రాదుర్భావములైన యవతారములందును జూపు భక్తికూడ గీతలోఁ జెప్పఁబడిన "దేవభక్తులు దేవులఁగాంత్రు నా భక్తులున్ ననున్" (గీత. ౭. ౨౩.) అను వాక్యశేషమం వల్ల పరమ భక్తియె.

మూ. జన్మకర్మవిదశ్చాஉజన్మశబ్దాత్.

(శా. ౪౭.)

సూ. జన్మయుండదని చెప్పుటచే "అజన్మ" శబ్దప్రయోగము వలన జన్మ కర్మలను దెలిసినవానికిని జన్మయుండదు.

"దివ్యమైనట్టి యీనాదు జన్మకర్మలతత్త్వమున్,
గాంచువాఁడు పునర్జన్మ. లేకనన్జేరునర్జునా"
(నా తెనుఁగు గీత. ౪ ౯.)

మూ. తచ్చ దివ్యంస్వశక్తి మాత్రోద్భవాత్.

(శా. ౪౮.)

సూ. భగవంతుడు స్వశక్తి మాత్రముచేతనె యుద్భవించుట వలన భగవంతుని జన్మ దివ్యమైనది.

భకవంతునికి పుట్టుక లేదుగాన పుట్టుకఅనఁగా ఇట ప్రకటనమగుట అని తెలియునది.

మూ. ముఖ్యం తస్యహి కారుణ్యం. (శా. ౪౯)

సూ. భగవంతుఁడు జన్మను గ్రహించుటను జీవులయందతనికిఁ గల కరుణయే ముఖ్యకారణము.

మూ. ప్రాణిత్వాన్న విభూతిషు. (శా. ౫)

సూ. రాజాదులు ప్రాణధారులు గాన పరమేశ్వరుని విభూతులైన రాజాదులందు చూపు భక్తి పరమభక్తిగాదు.

"నరులందు నరేశుఁడన్" (తెనుగుగీత ౪౦. ౨౮.) అని యిట్లు చెప్పఁబడిన విభూతులందుఁజూపుభక్తి పరమభక్తి గాదని భావము.

మూ. ద్యూతరాజసేవయోః ప్రతిషేధాచ్చ (శా. ౫౧.)

సూ. జూదమును రాజసేవయు ధర్మశాస్త్రములలో నిషేధింపఁబడుటచే వానియందుఁ జూపఁబడుభక్తి పరమభక్తి కాదు.

మూ. వాసుదేవేఽపీతి చేన్న ఆకారమాత్రత్వాత్.
(శా. ౫౨)

సూ గీతలో విభూతులందుఁ జెప్పఁబడిన రాజాదులందుఁ జూపఁబడిన భక్తి పరమభక్తి కానపుడు యాదవులందుఁ గృష్ణుండన్ (గీ. ౧౦. ౩౭.) అనుచోటఁ జెప్పఁబడిన కృష్ణునందలి భక్తి పరమ భక్తి కానేరదన్నచో ఆ కృష్ణుఁడు కేవలము పై యాకారమును బట్టి ప్రాణియైనను అసలు దేవుఁడు గాన పైని జెప్పినట్లు అనరాదు.

"యదోర్వంశం నరః శ్రుత్వా సర్వపాపైః ప్రముచ్యతే
యత్రావతీర్ణం విష్ణ్వాఖ్యం పరబ్రహ్మ నరాకృతి"
(విష్ణుపురాణ. ౪. ౧౧. ౨.)

"నరుఁడు యాదవులవంశము విన్నచో సర్వ పాపములనుండి ముక్తి పొందును. ఆ యాదవవంశము నుఁడి విష్ణువనెడి పరబ్రహ్మము నరా

కారముతో నవతరించినది.” ‘కృష్ణస్తు భగవాన్ స్వయం’.

(భాగ ౧. ౩. ౨౮.)

“సరసింబాసినఁ బాలు కాలువల యోజన్ విష్ణునందైన శ్రీ
కరనానాప్రకటావతారము లసంఖ్యాతంబు. లుర్వీశులున్
సురలున్ బ్రాహ్మణ సంయమీంద్రులు మహర్షుల్ విష్ణువంశాంశజుల్
హరికృష్ణుండు. బలానుజన్ముఁడెడ లేదా విష్ణువేనేర్పడన్.

(భాగ. ౧ ౭౭.)

మూ. ప్రత్యభిజ్ఞానాచ్చ. (శా. ౫౩.)

సూ. ఈ వాసుదేవుఁడు ఆ ప్రళయ కాలములో మున్ను నేను జూచిన పరమేశ్వరుఁడే అని మార్కండేయుఁడు గుర్తించి చెప్పుట వలన కృష్ణుఁడు భగవంతుఁడె.

“యఃస దేవో మయాదృష్టః పురాపద్మాయతేక్షణః,
స ఏవ పురుషవ్యాఘ్రః సంబంధీ తే జనార్దనః

(మహాభార తన ౧౮౯. ౫౨)

“పూర్వము నాచే పుండరీకాక్షుఁడైన యే దేవుఁడు చూడఁబడెనో ఆ పురుషవ్యాఘ్రుఁడె నీ బంధువైన యా జనార్దనుఁడు” అని మార్కండేయుఁడు ధర్మరాజుతోఁ జెప్పిన వాక్యము ఇందు ప్రమాణము అని భావము.

మూ. ఏవం ప్రసిద్ధేషు చ. (శా ౫౫.)

సూ. ఇట్లు ప్రసిద్ధులైన వామన రామాద్యవతారములందుఁ గల భక్తి పరమ భక్తి యని భావము.

(ఇది యయిదవ ప్రకరణము)



# భక్తితత్త్వదర్శనము

## ఆరవ ప్రకరణము

### కృష్ణుఁడు భగవంతుఁడు

మూ. భక్త్యా భజనోపసంహారాద్గౌణ్యా పరాయై తద్ధేతుత్వాత్
(శా. ౫౬.)

సూ. "భక్తితోఁ గొల్చువారిలో నేనుందు" ఇత్యాది గీతా వాక్యములలోని భక్తిపదముచే భజనమె గ్రహింపఁబడుటవలన, సగుణ భక్తి పరమ భక్తికి హేతువుగాన అది యాపరమభక్తిలోనిదే యగును.

మూ. రాగార్థప్రకీర్తి సాహచర్యాచ్చేతరేషాం. (శా. ౫౭.)

సూ. అనురాగమునకు, గుణమాహాత్మ్య కీర్తనము హేతువులైనట్లు ఆ కీర్తనతో సాహచర్యమునుబట్టి నామశ్రవణ పూజా వందనాదులును పరమ భక్తికిఁ గారణములె.

మూ. అంతరాళేతు శేషాఃస్యు రుపాస్యాదౌచ కాండత్వాత్.
(శా. ౫౮.)

సూ. ఉపాసనాదులందును బ్రహ్మకాండము భక్తికాండ రూపమె గనుక గీతలో మధ్యగాఁ జెప్పఁబడిన కీర్తన, భజన యత్న వ్రత, నమస్కార, జ్ఞానయజ్ఞ ధ్యాన, యాగదాన సర్వార్పణ బుద్ధ్యాదులును పరమభక్తికి అంగములె.

(చూ. గీత. ౯ - ౧౪, ౧౫, ౨౨, ౩౪, ౨౬, ౨౭, ౨౮ పద్యములు.)

మూ. తాభ్యః పావిత్ర్య ముపక్రమాత్. (శాం ౫౯)

సూ. గీతలో ఇది పవిత్రము. అని యుపక్రమించుటవల్ల ఆ సగుణభక్తులవల్ల పాపక్షయపూర్వకమైన చిత్తపవిత్రత కలుగును.

మూ. తాసు ప్రధానయోగాత్ ఫలాధిక్యమేకే (శా. ౬౦.)

సూ. ఇదివఱకు చెప్పఁబడిన కీర్తనాదులందు ప్రధానమైన సంబంధముండుట వలన బరమభక్తిగా మనుష్యుఁడు చేయు కీర్తనాదుల వలన నెక్కువ ఫలముండునని కొందఱు అనిరి

మూ. నామ్నేతి జైమినిః సంభవాత్ (శాం. ౬౧.)

సూ. భక్తికి నామకీర్తనముతో అన్వయము సంభవించుట వలన (భక్తిపూర్వక కీర్తనమువల్ల) పరమభక్తి గలుగునని జైమిని యనెను.

మూ. అత్రాంగ ప్రయోగాణాం యథా కాల సంభవో గృహాది వత్ (శాం ౬౨)

సూ. గృహాదినిర్మాణములో వీలునుబట్టి సంభవించిన తత్తదుపకరణములను ప్రయోగించునట్లు కీర్తన శ్రవణాదులైన భక్త్యంగములును వీలునుబట్టి యథాసంభవముగ ప్రయోగింపవచ్చును.

మూ. ఈశ్వరతుష్టే రేకోఽపి బలీ (శాం. ౬౩.)

సూ. కీర్తనాదులను విశేషముగాఁ జేసినను ఆ కీర్తనాదులలో ఒక్కటొక్కటైనను ఈశ్వరసంతుష్టికి సమర్థమైనదగును.

మూ. అబంధోఽర్పణ స్యముఖం (శాం, ౬౪.)

సూ. భగవదర్పణకు ముఖము కర్మ బంధము లేకపోవుటయే. భగవదర్పణ బుద్ధితోఁ జేయఁబడినకర్మ. దాని శుభాశుభఫలములను ఇవ్వదు. కాన అది బంధకారణముకాక పరమభక్తి ప్రాప్తికి కారణ మగునని భావము.

మూ. ధ్యాన నియమస్తు దృష్ట సౌకర్యాత్ (శాం. ౬౫)

సూ. చిత్తము ధ్యేయరూపమును పొందుటయను దృష్ట ఫలమందు సౌకర్యముండుటనుబట్టి ధ్యాననియమములైతె చెప్పఁబడెను.

మూ. తద్యజిః పూజాయాం, మితరేషాం నైనం (శాం ౬౬.)

సూ. "యాంతి మద్యాజినోపి మాం" నన్ను యజించు వారును నన్ను పొందుదురు (గీత. ౯. ౨౫) అనుచోటనున్న యజ క్రియకు పూజించుటయనియె యర్థము. ఇతరమగుచోట్ల నున్న యజక్రియకు పూజ యర్థము కాదు.

అనఁగా నన్నుఁబూజించవలె ననఁగా పూజాదులద్వారా భక్తులు నన్నుఁ బొందుదురని శ్రీకృష్ణుఁడు చెప్పెనని భావము.

మూ. పాదోదకంతు పాద్య మవ్యాప్తేః (శాం. ౬౭)

సూ. పాదోదకమనకైతే భగవంతుని పాదములు కడుగు నుద్దేశముతో నర్పింపఁబడిన పాద్యజలము అనియె యర్థము. అట్లు గానిచో సాక్షాత్తుగా భగవంతుని పాదోదకము సులభముగాన ఆమాటకు అవ్యాప్తిదోషము పట్టును.

"పాదోదకం భగవతః ప్రపునాతి సద్యః" భగవంతుని పాదోదకము వెంటనే పవిత్రము చేయును. (నృ. పు. ౫౯. ౪౬.) ఇత్యాది వాక్యములందు పాదోదకము అనువానికి పై సూత్రములోని యర్థము చెప్పవలయునని భావము.

మూ. స్వయమర్పితం గ్రాహ్య మవిశేషాత్ (శాం. ౬౮)

సూ. స్వయముగా భగవంతునికి నైవేద్యముగా నర్పింపఁబడిన దానిని-తానును విష్ణుభక్తుఁడగుటలో విశేషము లేకపోవుట వలన స్వయముగా గ్రహింపనగును.

భగవంతుని కర్పింపఁబడిన వస్తువును విష్ణుభక్తునికి ఇవ్వవలయునని నియమము. తానును విష్ణుభక్తుఁడే కనుక స్వీకరింపవచ్చునని భావము.

మూ. నిమిత్తగుణా వ్యపేక్షణాదపరాధేషు వ్యవస్థా. (శాం. ౬౯.)

సూ. భగవంతుని పూజలోఁ గలుగు నపరాధములో అనిచ్ఛాపూర్వకముగాఁ జేయఁబడిన యపరాధముకంటె ఏదో నిమిత్తముచేఁ జేయఁబడినది పెద్దదని ఇట్లు వ్యవస్థ చేయవలయును.

మూ. పాత్రాదేర్దాన మన్యథాహి వైశిష్ట్యం. (శాం. ౭౦)

సూ. వస్త్ర పుష్ప ఫలాది దానము భగవానునుద్దేశించి చేసినచో అది పరమభక్తికి అంగము అగును. అట్లుగానిచో ఆదానము కేవలము భక్తివిశిష్టమే యగునుగాని పరమభక్తి విశిష్టము కానేరదు.

మూ. సుకృతజత్వాత్ పరహేతు భావాచ్చ క్రియాసు శ్రేయస్యః. (శాం. ౭౧.)

సూ. పూర్వము చెప్పఁబడిన సగుణభక్తులు పూర్వసుకృతముచే జన్యములగుటవలన పరమభక్తికి హేతువులగుచున్నవి కాన అవి క్రియ లంను శ్రేయస్కరములగును

మూ. గౌణంత్రై విధ్యమితరేణ స్తుత్యర్థత్వాత్ సాహచర్యం (శా. ౭ ౨.)

సూ ఆర్తభక్తి, జిజ్ఞాసాభక్తి, అర్థార్థభక్తియను మూఁడు విధములుగల భక్తి పరమభక్తియైన జ్ఞాన భక్తితోపాటు స్తుతికొఱకుఁ గాన వానితోపాటు చెప్పఁబడెను.

మూ. బహిరంతస్థ ముభయ మవేష్టి సవవత్. (శా ౭౩.)

సూ అవేష్టియాగము ప్రధానముగాను రాజసూయ వాజపేయాది యాగములకు అంగముగాను ఉభయరీతిగాను నున్నట్లు స్మరణ కీర్తనాదులు పైనినుండి స్వతంత్రములుగాను పరమభక్తికి సాధనములుగా లోపలనుండి పరతంత్రములుగాను ఉండును.

"యజ్ఞాదులలో పొరపాటువలన లోపము సంభవించినచో విష్ణుస్మరణచే ఆ లోపము నశించు" ఇత్యాది వాక్యములచే స్మరణ కీర్తనాదులు ప్రధానములని సూచితమగుచున్నది.

మూ. స్మృతికీర్త్యోః కథాదేశ్చార్తౌ ప్రాయశ్చిత్త భావాత్. (శా. ౭౪.)

సూ. స్మరణ, కీర్తన కథాశ్రవణ నమస్కారాదులు ఆర్త భక్తిలో ప్రాయశ్చిత్త రూపములో నున్నవిగాన అవి పరతంత్రములు నగును.

"ప్రాయశ్చిత్తా న్యశేషాణి తపఃకర్మాత్మకానివై, యాని తేషా మశేషాణాం కృష్ణానుస్మరణం పరం" తపః కర్మరూపమైన ప్రాయశ్చిత్తము లన్నిటిలోను కృష్ణానుస్మరణమె ముఖ్యము.

(విష్ణుపు ౨ ౬. ౩౫ )

మూ. భూయసా మననుష్ఠితిరితి చే దాప్రయాణ ముపసంహారా న్మహత్స్వపి. (శా. ౭౫ )

సూ. మహాపాతకములు పోవుటకై మహాప్రాయశ్చిత్త కర్మలు అనుష్టింపఁబడుటలేదు కాన మహాపాతకములు పోవు అన్నచో మరణించువఱకు స్మరణ కీర్తనములు చేసినచో మహాపాతకములును పోవునని పురాణములందు ఉపసంహారము చేయుటవలన మహాపాతకములందు స్మరణకీర్తనాదులు తన్నాశమునకయి సమర్థము లగును.

"తస్మాదహర్నిశం విష్ణుం సంస్మరన్ పురుషో మునే।
నయాతి నరకం శుద్ధః సంక్షీణాఖిలపాతకః

(విష్ణువు. ౨. ౬. ౪౯ )

"కనుక ఓ మునీ! పురుషుఁడు రాత్రియుఁ బవళ్లు విష్ణువును స్మరించుచు శుద్ధుఁడై క్షీణించిన యఖిల పాతకములుగలవాఁడై నరకమును పొందఁడు అని చెప్పఁబడెను.

మూ. లఘ్వపి భక్తాధికారే మహత్ క్షేపక, మపర సర్వహానాత్.

(శా. ౭౬.)

సూ. లఘువైన స్మరణ కీర్తనాదికమును మహాపాపనాశకమగును. కనుకనే నన్ను శరణుపొంది. మిగిలిన సర్వకర్మలను విడువుమని చెప్పఁబడెను.

"ధర్మంబులెల్ల వర్జించి, ననొక్కండె శరణొందుమీ
సర్వపాపాలనుండి నిన్, విడిపింతు వగన్ విడు.
(నా తెనుఁగు గీత. ౧౮.౬౬.)

మూ తత్స్థానత్వా దనన్య ధర్మః ఖలేబాలీవత్ (శా. ౬౭)

సూ కళ్ళములో మేఘమును యజ్ఞయూపస్తంభముగా వ్యవహరించుటకు అందు పశువైతే బంధింపఁబడుచున్నది కాన యూప స్తంభమునకై యవసరమని భావింపఁబడు నితరకర్మానుష్ఠానము ఆవశ్యకముగాఁ దలపఁబడునట్లు ఇటనుగూడ స్మరణకీర్తనాదులు పాప ప్రాయశ్చిత్తములగు కృచ్ఛచాంద్రాయణాది వ్రతములకు బదులుగా ప్రతిష్ఠింపఁబడుచున్నవి కాన ఆ ప్రాయశ్చిత్తాంగములైన ముండనాది ప్రాయశ్చిత్త కర్మల పాలనము కీర్తనాది పరాయణుఁడైన భక్తునికి ఆవశ్యకముగా దలఁపఁబడదు.

మూ. ఆనిన్ద్యయోన్యధిక్రియతే పారంపర్యాత్ సామాన్య వత్. (శా. ౭౮.)

సూ. చండాలాది నింద్యజాతి మనుష్యులవరకు అందఱు సమానముగా భక్తికిఅధికారులు. అట్లే అహింస సత్యము అస్తేయము మొదలగు సామాన్య ధర్మముల జ్ఞానములోను ఆచరణలోను అందఱకు సమానాధికారము కలదని అచార్య శాస్త్రాది పరంపరచే సిద్ధమగు చున్నది.

మూ. అతోహ్యావిపక్వభావానామపి తల్లోకే. (శా. ౭౯.)

సూ కనుకనె శ్వేతద్వీపాది లోకమందు పరిపక్వము గాని భావముగలవారికిఁ గూడ భక్త్యధికారము గలదు.

"క్షీరోదధేరుత్తరతః శ్వేతద్వీపో మహాప్రభః,
తత్రనారాయణపరా మానవాశ్చంద్ర వర్చసః"
ఏకాంతభావోపగతా స్తే భక్తాఃపురుషోత్తమే,

క్షీరసముద్రమున కుత్తరముగా గొప్ప కాంతిగల శ్వేతద్వీపము గలదు. అందు మానవులు నారాయణభక్తిపరులు వారు చంద్రవర్చస్సు గలవారు. ఏకాంతభావమును పొందినవారు. వారు పురుషోత్తముని యందు భక్తులు అని. (మహాభార. శాంతి. మోక్ష. ౩౩౮. అధ్యా.)

మూ. క్రమైకగత్యుపపత్తేస్తు (శా. ౮౦.)

సూ. పరిపక్వముగాని భక్తిగలవారు ఆ యిహాలోకములు పొందుచు క్రమముగాను, పరిపక్వమైన భక్తిగలవారు ఒక్కసారిగను భగవంతునిఁ బొందుదురని చెప్పుట యుపపన్నమగుటకైతే పై చెప్పిన పద్ధతి యంగీకరింపవలెను.

మూ. ఉత్క్రాంతి స్మృతివాక్యశేషాచ్చ. (శా. ౮౧.)

సూ. శరీరమునుండి పోవువారలను గూర్చి చెప్పిన స్మృతి వాక్యశేషమునుబట్టియును పరిపక్వముగాని భక్తిగలవారికి క్రమముక్తి యును పరిపక్వభక్తి గలవారికి ఒక్కమాటుగా ముక్తియును సిద్ధమగు చున్నది.

"అగ్ని జ్యోతి పవల్ శుక్ల, ముత్తరాయణ మార్గ్నెలల్
వీనియందుఁజనిపోవు, బ్రహ్మజ్ఞుల్ గాంత్రు బ్రహ్మమున్.
(నా తెనుగు గీత. ౮. ౨౪.)

చనిపోయినపిదప అగ్నిదేవతను దానినుండి యహర్దేవతను శుక్లపక్ష దేవతను ఉత్తరాయణ దేవతను సంవత్సర దేవతను, దేవలోక దేవతను,

వాయులోక దేవతను సూర్యుని చంద్రుని మెఱపును వరుణలోకమును ఇంద్రలోకమును, ప్రజాపతి లోకమును క్రమముగఁ జేర్చి యొక యమానుష పురుషుఁడు జీవులను బొందించును వీరు తిరిగిపుట్టరు" అని శ్రుతి.

మూ. మహాపాతకినాం త్వార్తౌ. (శా. ౮౨.)

సూ. మహాపాతకులకైతే ఆర్తభక్తియందె అధికారము గలదు. ఆ మహాపాతకులు ఆర్తభక్తి (ఆర్తులు, బాధపడువారు భజించుభక్తి) ద్వారా పాపముక్తులై పిదప పరమ భక్తికి అధికారులగుదురని భావము.

మూ. సైకాంతభావో గీతార్థ ప్రత్యభిజ్ఞానాత్. (శా. ౮౩.)

సూ గీతలోఁ జెప్పఁబడిన యర్థమును స్మరించుట వలన ధనము, పదములు, పశుపుత్రాదులు సంపదలు మొదలగువానియందు గాక భగవంతునియందు మాత్రమె గల యనురాగ భావమె పరమభక్తి.

"ఎవఁడన్నిట నన్గాంచు, నాలోనన్నియుఁ గాంచునో
వానికినేఁ గనిపింతును, నాకున్ వాఁడు గనంబడున్.
(తెనుఁగు గీత. ౬. ౩౦.)

"అనన్యచిత్తులై నన్ను, నెంచి కొల్చుచు నిత్యమున్
స్థిరులై యుండువారల, యోగక్షేమము పూనెదన్.
(తె. గీ ౯. ౨౨.)

"నన్నె భావింపు, నన్గొల్వు, నన్ వ్రేల్చు నన్నె మ్రొక్కుమీ
యిట్లాత్మ నన్గొల్వ, నన్నెపొందెద వర్జునా"
(తె. గీత. ౯. ౩౪.)

"నా కర్మల్ చేసి నన్నమ్మి, నా భక్తిన్ గోర్కెలేక యే
సర్వప్రాణుల ప్రేమించు, వాఁడు నన్నొందు నర్జునా.
( తె. గీత. ౧౧. ౫౫ )

"సర్వకర్మలు నాయందె, యర్పించి నన్నెగోరుచున్
అనన్య శ్రద్ధ నెవ్వారు, ధ్యానించుచును గొల్తురో
వారిని మృత్యుసంసార, వార్ధిం దరింపఁ జేయుదున్
నాపైఁ జిత్తముంచువారి, కాలసింపను ఫల్గునా,
( తె. గీ. ౧౨ ౬, ౭ )

ఇత్యాదులు గీతావాక్యములు.

మూ. పరాం కృత్వైవ సర్వేషాంతథాహ్యేవా. (శా ౮౪)

సూ. పరమభక్తిని గుఱించే కీర్తనాది సర్వసాధనములకు ముక్తిలో ఉపయోగము కలుగును అట్లుగూడఁ జెప్పఁబడె.

"ఈ పరమ రహస్యంబు, నా భక్తులకుఁ జెప్పువాఁ
డెంతయో భక్తి నాయందు, నిల్పి తప్పక నన్గనున్.
(గీత ౧౮. ౬౮.)

ఋషయో మనవో దేవా మనుపుత్రా మహౌజసః
కళాఃసర్వే హారేరేవ సప్రజాపతయస్తథా
ఏతే చాంశకళాఃపుంసః
కృష్ణస్తు భగవాన్స్వయం (భాగ. పూ. ౩. ౨౩. ౨౮.)

ఋషులు మనుబ్రహ్మలు దేవతలు మను కుమారులు ప్రజాపతులు వీరందఱు ఆ విష్ణువుయొక్క అంశలు. కృష్ణుఁడు మాత్రము స్వయముగా భగవంతుఁడు. పరమేశ్వరునికి కొందఱు అంశలు, కొందఱు

కళావిభూతులు, మత్స్యాద్యవతారములకు సర్వజ్ఞత్వ సర్వశక్తి మత్త్వాదులున్నను ఉపయోగము ననుసరించియే జ్ఞానక్రియాది శక్తులు అవిష్కరింపబడెను. కుమారస్వామి నారదాదులందు ఉపయోగమును బట్టి అంశకలావేశకలిగెను. కుమారాదులందు జ్ఞానావేశమె. భూమ్యాకులందు శక్త్యావేశమె, కృష్ణుఁడె తేసర్వశక్తులనుఆవిష్కరించివ వాఁడు గాన సాక్షాత్తు నారాయణుఁడే. (భాగవత భావార్థ దీపిక).

"అవ్యక్తం వ్యక్తిమాసన్నం మన్యంతే మామబుద్ధయః
పరంభావ మజానంతో మమావ్యయ మనుత్తమం".
(భగవద్గీత ౭. ౨౪.)

"నాశంబులేక శ్రేష్ఠమౌ, నా పరతత్త్వ మెంచక,
మూఢుల్ రూపంబులేని, నన్నెంతురు రూపధారిగన్".
(తెనుఁగుగీత)

"అవజానంతి మాం మూఢాః మానుషీంతనుమాశ్రితం
పరంభావ మజానంతో మమభూత మహేశ్వరం".
(భగవద్గీత ౯. ౧౧ )

"భూతేశ మూర్తినౌ నాదు పరతత్త్వమెంచక
మర్త్యదేహామూనితి నంచవమానింత్రు నన్ జడుల్".

ఈ వాక్కులచే కృష్ణుఁడు అనఁగా కృష్ణునిలో నుండి కృష్ణునికంటె వేఱుకాక - కృష్ణుఁడు అను పైరూపముదాల్చిన ఆత్మ తత్త్వమె పరమేశ్వరుఁడని భావము.

(ఇది ఆరవ ప్రకరణము)

— ⋮ —

# భక్తితత్త్వ దర్శనము

## ఏడవ ప్రకరణము

## దుస్సంగత్యాగాది సాధనములు

మూ. దుస్సంగః సర్వథాత్యాజ్యః (నార. ౪౩)

సూ. దుష్టులతో సంబంధము అన్నివిధముల విడువఁదగినది.

మూ. కామక్రోధ, మోహ, స్మృతిభ్రంశ, బుద్ధినాశ, సర్వనాశకారణత్వాత్. (నార. ౪౪.)

సూ. దుష్టుల సాంగత్యము వలనఁ గామము, క్రోధము, మోహము, స్మృతిభ్రంశము, బుద్ధినాశము సర్వనాశము క్రమముగాఁ గలుగును గాన అది యన్నివిధములఁ ద్యజింపఁదగినదే.

మూ. తరంగాయితా అపి ఇమే సంగాత్ సముద్రాయంతి. (నార. ౪౫)

సూ. క్రోమ క్రోధాదులు మొదటఁ జిన్న కెరటములుగా నున్నను దుస్సాంగత్యమువలన సముద్రమంత పెద్దవి యగును.

మూ. కస్తరతి కస్తరతి యోమాయాం, యస్సంగాంస్త్యజతి. యో మహానుభావంసేవతే నిర్మమో భవతి. (నార. ౪౬.)

సూ. ఎవఁడు మాయను తరించును, ఎవఁడు మాయను తరించును ? ఎవఁడు అన్నివిధములయిన సంగములను విడుచునో, ఎవఁడు మహాత్ములను సేవించునో ఎవఁడు మమకారమును విడుచునో వాఁడే మాయను దరింపఁగలఁడు తరింపఁగలఁడు.

మూ. యో వివిక్తస్థానం సేవతే, యో లోకబంధ మున్మూలయతి, నిస్త్రైగుణ్యో భవతి, యోగక్షేమంత్యజతి. (నా. ౪౭.)

సూ. ఎవఁడు ఏకాంత వాసమును సేవించునో ఎవఁడు లౌకిక బంధములను త్రెంచివైచునో, ఎవఁడు త్రిగుణముల నతీతించునో, ఎవఁడు శరీర యోగక్షేమములను విసర్జించునో వాఁడె మాయను తరించును

"భోజనాచ్ఛాదనే చింతాం వృథాకుర్వంతి వైష్ణవాః
యో వా విశ్వంభరో దేవః స కిందాసానుపేక్షతే"

"తిండి బట్టలనుగుఱించి వ్యర్థముగా విష్ణు భక్తులు చింతించుచున్నారు. సర్వ ప్రపంచమును భరించెడి యీ దేవుఁడు తన దాసులను ఉపేక్షించునా ఏమి?" అని సూక్తి. ఇందునుగూర్చి యొక కథకలదు,— ఒకసారి నారదమహాముని యొక యడవిగుండా పోవుచుండెను. అపుడొక బోయవాఁడు పక్షులను వేటాడుచు దొరకిన పక్షి ఱెక్కలను విఱిచి బుట్టలో వేసికొనుచుండెను. అపుడది చూచి నారదుఁడు వానితో "ఓయీ ఆ పక్షుల ఱెక్కలను విఱువకుము ఒక్కసారిగా ఆ పక్షుల మెడలను విఱిచివేయుము" అనెను. అది విని ఏమి అట్లను చున్నారు అని బోయవాఁడు అడిగెను. అపుడు నారదుఁడనెను. ఓ నాయనా! మఱుసటి జన్మలో నీవు పక్షివై పుట్టుదువు, ఆ పక్షి బోయవాఁడై పుట్టును అపుడది నీ ఱెక్కలను విఱిచివేయును అపుడు నీవు చాల బాధపొందెదవు. మెడయేగనుక విఱచితివా ఆ పక్షి నీ మెడ ఒక్కసారిగా విఱిచివేయును. నీ కప్పుడంతగా బాధయుండదు. నాకు నీ మఱుసటిజన్మసంగతి తెలిసికొని జాలివేయుచున్న దనెను. అపుడు ఆ బోయవానికి పశ్చాత్తాపము గలిగి అయితే నేనీ

వృత్తిని మానినచో నా తిండి యెట్లు అనెను. అపుడు నారదుఁడు 'నేను చెప్పినట్లు చేసినచో భగవంతుఁడు నీ కెప్పటికప్పుడు ఆహారము పంపును' అనెను. అయితే అట్లు చేసెదనని ఆ బోయవాఁడు విల్లు బాణములును పాఱవైచి నారదునితో ఏమి చేయమందురో చెప్పుఁడు అట్లే చేసెదను అనెను. అపుడా నారదుఁడు 'ఈ యూరిలో చెఱవు దగ్గఱ రావిచెట్టు ఉన్నది. ప్రతిరోజు స్నానముచేసి అక్కడ భగవంతుని నమ్మి "హరేరామ హరేరామ" అని స్మరించుచుండుము నీకు వేళకు తిండిభగవంతుఁడు పంపుచుండును అనెను. అంతట వాఁడు వెంటనే నారదునికి నమస్కరించి వెడలిపోయి స్నానముచేసి చెట్టుక్రింద కూర్చుండి మౌనముతో భగవంతుని స్మరణచేయఁదొడఁగెను. ఆ సమయమున నీళ్ళకై వచ్చు స్త్రీలు వీనిని జూచి భగవంతుఁడు కలిగించిన ప్రేరణచేత ఆ బోయవానిని నిజమైన భక్తునిగాఁ దలఁచి వానిదగ్గఱ అరటిపండ్లు కొబ్బరికాయ పెట్టి వెళ్ళిపోవుచుండిరి. అతడు కొంత సేపటికి కన్నులు తెఱచి చూచునప్పటికి పండ్లు చూచి ఆఁకలిదీఱునంత తిని మిగిలినవి ఎవరికో యొక్కరికి ఇచ్చెను. ఇట్లే ప్రతిరోజు ఎవరో యొకరు పండ్లు పెట్టుట అతడు తిని యితరులకు పెట్టుట జరుగుచుండెను. ఇట్లు కొన్ని నెలలు జరిగెను. ఒకనాఁడు నారదుఁడు వీనిని జూచుటకై వచ్చెను. అపుడు అతఁడు నారదుని దూరముగానే చూచి దారిలో చీమలను ద్రొక్కకుండ దాటుచు వచ్చి నమస్కరించెను. 'ఏమి నాయనా! నీకు ఆహారము వచ్చుచున్నదా' అని నారదుఁడడిగెను. అందుకాతఁడు 'అయ్యా! ఆహారము ఎక్కువగుచున్నది. కొంచెము తక్కువ పంపునట్లు చేయుఁడు' అనెను. సరే అట్లే యని ఆ బోయవాని నమ్రతకు భక్తికి మెచ్చి నారదుఁడు వెళ్ళిపోయెను. దీనిని బట్టి భగవంతుని నమ్మినవారికి ఏ లోటును గలుగదని తెలియుచున్నది.

మూ॥ యః కర్మఫలం త్యజతి, కర్మాణి సంన్యసతి తతో నిర్ద్వంద్వో భవతి. (నార. ౪౮.)

సూ. ఎవఁడు కర్మల నాచరించుచు నా కర్మఫలమును విడచునో. ఎవఁడు ఫలము వీడి యందువలన సుఖదుఃఖాది ద్వంద్వములను విడచునో వాఁడె మాయను దాటును.

మూ. వేదానపి సంన్యసతి కేవల మవిచ్ఛిన్నానురాగం లభతే. (నార. ౪౯.)

సూ. ఎవఁడు వేదములను గూడ (వేదోక్త కర్మలను గూడ) సంన్యసించి కేవలము ఎడతెగని భగవదనురాగమును పొందునో వాఁడు మాయను తరించును.

మూ. సతరతి సతరతి సలోకాంస్తారయతి. (నార. ౫౦.)

సూ. వాఁడు తరించును వాఁడు తరించును, వాఁడు లోకులను గూడ తరింపఁజేయును.

(ఇది ఏడవ ప్రకరణము)

....***....

భక్తితత్త్వ దర్శనము

# ఎనిమిదవ ప్రకరణము

## ప్రేమ స్వరూపము

మూ. అనిర్వచనీయం ప్రేమస్వరూపం. (నార. ౫౧.)

సూ. ఆ ప్రేమరూపమైన భక్తిస్వరూపము ఇట్టిదని చెప్ప శక్యముగానిది.

మూ. మూకాస్వాదనవత్. (నార. ౫౨.)

సూ. అది మూఁగివాని రసాస్వాదనము వంటిది.

మూఁగివాఁడు తాను తిన్న మధురపదార్థము యొక్క రుచి యిట్టిదని చెప్పలేక కేవలము తనచేష్టల ద్వారానే ఆనందమును వ్యక్తపఱచును అట్లే భక్తుఁడు భక్తిపారవశ్యమున ఒడలు మఱచి మాటాడలేక కేవల చేష్టలతోనే ఆ బ్రహ్మానందమును వ్యక్తపఱచును.

ప్రహ్లాదుఁడిట్లే "ప్రణయహర్షజనిత బాష్పసలిల మిళితపులకుఁడై నిమీళిత నేత్రుఁడై యొక్కచోట నిలిచి యూరకుండును.

మూ. ప్రకాశతే క్వాపి పాత్రే. (నార. ౫౩.)

సూ. ఇటువంటి ప్రేమ యొకానొక యర్హునియందే ప్రకాశించును.

మూ. గుణరహితం కామనారహితం ప్రతిక్షణ వర్ధమాన మవిచ్ఛిన్నం సూక్ష్మతర మనుభవరూపం. (నార. ౫౪.)

సూ. ఇట్టి ప్రేమ నిర్గుణమైనది నిష్కామమైనది. ప్రతిక్షణము వర్ధిల్లుచుండును, ఎడతెగనిది. సూక్ష్మముకంటెను సూక్ష్మమైనది అనుభవైకవేద్యమయినది.

మూ. తత్ప్రాప్య తదేవావలోకయతి, తదేవ శృణోతి, తదేవ భావయతి. తదేవచింతయతి. (నార. ౫౫.)

సూ. అట్టి ప్రేమను బొంది భక్తుఁడు దానినే చూచును దానినే వినును దానినిగూర్చి మాట్లాడును, దానినే భావించును.

"యత్ర నాన్యత్పశ్యతి. నాన్యచ్ఛృణోతి నాన్యద్విజా
నాతి సభూమా. అథ యత్రాన్యత్పశ్యతి అన్య
చ్ఛృణోతి; అన్యద్విజానాతి త దల్పం, యో వై భూమా
తదమృతమథ యదల్పం తన్మర్త్యం. (ఛాందో. ౭.౨౪.౧.)

"ఏది పొందియన్యమును దర్శింపఁడు వినఁడన్య.
మన్యము తెల్సికోఁ డదియె భూమ
మేదిపొంది యన్యమును దర్శించు వినును
నన్య. మన్యమును దెలియు నల్పమదియె
ఏది చూచునదె యమృతం బేదియల్ప
మదియె మర్త్యము. (నా ఉపనిషత్సుధ)

మూ. గౌణీత్రిధా గుణభేదా దార్తాది భేదాద్వా. (నార. ౫౬.)

సూ. గౌణభక్తి సాత్త్వికి, రాజసి, తామసి అని గుణభేదము లనుబట్టి గాని, ఆర్తభక్తి జిజ్ఞాసుభక్తి అర్థార్థిభక్తి అను భేదములను బట్టిగాని త్రివిధము.

మూ. ఉత్తరస్మా దుత్తరస్మాత్ పూర్వ పూర్వా
శ్రేయాయ భవతి. (నార. ౫౭.)

సూ. తరువాతి తరువాతి దానికంటె మొదటి మొదటి భక్తి శ్రేయస్కర మగును.

**మూ.** అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ (నార. ౫౮.)

సూ. పరమాత్మ ప్రాప్తిసాధనములైన గుణ యోగకర్మజ్ఞాన ముల కంటెభక్తి చాల సులభమైనది.

భక్తిని పొందుటకు విద్యగాని ధనముగాని ఉన్నత కులముగాని వర్ణాశ్రయ ధర్మాచరణముగాని వేదశాస్త్రాద్యధ్యయనముగాని కఠోర తపస్సుగాని వివేకముగాని అవసరములేదు. యోగము హఠయోగాది ప్రక్రియలచేఁ గష్టభూయిష్ఠము. కర్మ - వైదిక లౌకికాది బహువిధ మైనది. జ్ఞానము ఉపనిషద్వేదాంత శాస్త్రాది పరిశీలనచే ననేకవిధము. భక్తిమార్గమో పరమేశ్వరార్పణ బుద్ధితో తన్మయీభవనము గాన పరమ సులభమని భావము.

మూ. ప్రమాణాంతరస్యాఽనపేక్షత్వాత్. స్వయం ప్రమాణత్వాత్. (నార. ౫౯.)

సూ. భక్తి యితరప్రమాణాపేక్షగలదిగాదు గావున స్వయము గనే ప్రమాణము గలదిగాన అది పరమసులభమైనది.

భక్తుఁడు పరమేశ్వరునికి తన్ను అప్పగించును ఆనందించును పులకాంకితుఁ డగును. నిశ్చేష్టుఁడగును భక్తిపరవశుఁడై యానందించును. ఇట్లు ఆనందము పొందుటతోనే యనుభవించును. దీనికి ఇతర ప్రమాణముల పని లేదు. తానే ప్రమాణము.

**మూ.** శాంతిరూపాత్ పరమానంద రూపాచ్చ. (నార. ౬౦)

సూ భక్తి శాంతిరూపమైన దగుటవల్లను, పరమానందరూప మైన దగుటవలనను భక్తియె సులభమైనది.

మూ. లోకహానౌ చింతా న కార్యా, నివేదితాత్మ లోకత్వాత్.
(నార. ౬౧.)

సూ. భగవంతునికై తన లౌకిక వైదిక విషయములను తన సర్వస్వమును ఇదివఱకే అర్పించెను గాన భక్తునికి ఇంక లోకహాని కలుగునన్న చింతయె చేయరానిది.

మూ. న తదసిద్ధౌ లోకవ్యవహారో హేయః కింతు ఫలత్యాగస్త త్సాధనం చ కర్యమేవ. (నార. ౬౨.)

సూ. ఆ భక్తియందుఁ బరిపూర్ణత సిద్ధింపనంతవఱకు లోక వ్యవహారమును వదలరాదు. కాని భక్తికి సాధనమైన కార్మఫలత్యాగము మాత్రము ఆచరింపవలసినదే.

మూ. స్త్రీ. ధన, నాస్తిక, వైరి చరిత్రం న శ్రవణీయం.
(నార. ౬౩ )

సూ. ఆ లోకవ్యవహారములోఁగూడ స్త్రీ ధన, నాస్తిక శత్రు చరిత్రలు వినరాదు.

మూ. అభిమానదంభాదికం త్యాజ్యం (నాల. ౬౪.)

సూ. అభిమానము గర్వము మొదలగువానిని విడువవలయును, సంపద, సంతతి, శక్తి, స్వార్థ విద్యాబుద్ధి కుల వర్ణాద్యాశ్రమాచార రూప పదపురుషార్థ, జ్ఞాని పండితాద్యభిమానములను విడువవలయును. చివరకు నేను అభిమానము లేనివాఁడను అను నభిమానమును గూడ

విడువవలయును. ధర్మాత్ముఁడన భక్తుఁడను త్యాగిని అని పైకి ఈ మొదలుగాఁ గనిపింపఁజేయు దంభమును విడువవలెనని గీతలోఁ జెప్పఁబడిన దైవ సంపదను గ్రహించి అసుర సంపదను విడువవలెనని తెలియునది.

నిర్భీతిచిత్తశుద్ధియు....భూతదయయచాపల్యమలౌల్య మార్దవత్రపల్

"అద్రోహంబున్ వినయంబున్, ధైర్యమోర్పు శుచిత్వమల్
ఈ యవిదైవ సంపద, గల్గువాఁడొందు నర్జునా !
"దంభంబు స్వాభిమానంబు, పారుష్య క్రోధ గర్వముల్
అజ్ఞానంబివి యాసుర సంపదగల్గు వానికా,
ముక్తికా దైవసంపద, యాసురి బంధకారియా",

(తెనుఁగు గీత ౧౬. ౧.)

మూ. తదర్పితాఖిలాచారఃసన్ కామ క్రోధాభి మానాదికం తస్మిన్నేవ కరణీయం. (నార.౬౫.)

సూ. తన సకల కర్మలను భగవదర్పణము చేసినవాఁడై చివరకుఁ గామక్రోధాభిమానాదులను గూడ నా భగవంతుని యందె యుంచవలయును.

యశోద గోపికలు హిరణ్యాకశిపుఁడు శిశుపాలుఁడు కంసుఁడు మొదలగు వారిట్లే కామక్రోధాదులను భగవంతునిపై నుంచిరి.

ఆ. తె. బాంధవమున నైనఁ బగనైన వగనైనఁ
ప్రీతినైనఁ బ్రాణభీతినైన
భక్తినైన హరికిఁ బరతంత్రులై యుండు
జనులు మోక్షమునకుఁ జనుదురధిప.

(భాగ. ౧౦. పూ. ౯౨౫.)

ఇట్లే తల్లి తనకొడుకుమీఁదను కొడుకు తన ప్రియమైన తల్లిమీఁదను వాత్సల్యభక్తి, కామ క్రోధాదులు చూపుదురు. అట్లే భక్తులును జూపుదురని భావము

సర్వము భగవంతునికర్పించిన భక్తుల చరిత్రలు వింతగానుండును.

"రాముఁడు దేమిరా నిరపరాధుని దుర్జను లేచుచుండఁగా
నేమి యెఱుంగనట్టుల సహించుక యున్నపనేమి చెప్పరా
నీ మది కింతపవ్యామగునే యిఁకనెవ్వరు నాకు రక్షకుల్
కోమల నీలవర్ణ ! రఘుకుంజర ! మద్గతి జానకీపతీ !

కైదులో రామునిపై రామదాసు విసుగుకొనును.

"పిలిచినఁ బల్క వేమి ననుఁ బ్రేమను గన్నులఁ జూడవేమి, నేఁ
దలఁచిన తప్పులన్ని మఱి తప్పక చూపెదవేమి యయ్యయో
పలుమఱు నీవెదిక్కనుచుఁ బట్టితి నీ పదపద్మయుగ్మమున్
బలుచఁదనంబుఁ జేసినను బాములఁబెట్టకు జానకీపతీ :"

అని దైన్యముతోఁ జెప్పును.

రాగము – సావేరి – చాపు తాళము.

"సీతా రామస్వామీ ! చేసిననేరములేమీ ! ఖ్యాతిగ
నీ పద కంజయుగమునే ప్రీతిగఁ దలఁపక ఖేదమెంచితిన్ ॥సీత॥
రంగుగ నా పదివ్రేళ్ళకు రత్నపుటుంగరములు నిన్నడిగితినా
సంగతి బంగరు శాలువ పాగా లంగీల్ నడికట్లడిగితినా
చెంగటి భూసురపుంగవు లెన్నఁ చెవులకు చౌకట్లడిగితినా
ముంగర గొలుసులు ముత్యపు సరములు వంగనలకు నిన్నడిగితినా
॥సీత॥

ప్రేమతో నవరత్నంబులు దాపిన హేమ కిరీటం బడిగితినా,
కోమలమగు నా మెడలోఁ బుష్పపు దామములిమ్మని యడిగితినా
మోమోటంబిడకుండఁగ నీదగు మురుగులు గొలుసులు నడిగితినా
కమలేక్షణ! మిము సేవించుటకై ఘనముగరమ్మని పిలిచితిఁగానీ
॥సీతా॥

అని యిత్యాదికముగ రామదాసు గట్టిగా మాట్లాడును.

"ఓ రామా పలుకే బంగారమాయెనా కోదండపాణీ
పలుకే బంగారమాయెనా పిలచిన బలుకవేమి"

అని యధికారముతో నడుగును.

"ఇక్ష్వాకుకుల తిలక యికనైనఁ బలుకవె రామచంద్రా!
నన్ను రక్షింపు మింకనో రఘుకుల తిలక! శ్రీ రామచంద్రా!
చుట్టు ప్రాకారములు సొంపుతో గట్టిస్తి రామచంద్రా!
ఆ ప్రాకారానికి బట్టె పదివేల వరహాలు రామచంద్రా!"

అని బ్రతిమాలుకొనును. అయినను రాముఁడు విననపుడు—

"బిడియమేల నిఁక మోక్షమిచ్చి నీ వడుగుదాటిపోరా
తడనాయెను నే నోర్వలేను దొరతనము దాచుకోరా!"

అని యిట్లు గద్దించి పలుకును. చివరకు—

రాగము - వరాళి - చాపుతాళము

అడుగుదాటి కదలనియ్యను. నా కభయమియ్యక నిను విడువను
॥అడుగు॥

గడియగడియకు తిరిగి తిరిగి-యడిగితిని వేసరిలవచ్చితి
దడువు దప్పిన నేను నింక బహునుడుకుతనములు సేయుదుననిను
కుదురుగఁ గూర్చుండనియ్యను నీకుఁ గోపమువచ్చిన భయపడను
ఇది మదిని నెఱఁగియు నింక నీ మొగమోటమేమియులేమగద నా
హృదయ కమలమందు నీ మృదు-పదములను బంధించి వేయుదును
॥అడుగు॥

రేపు మా పని జరపినను-నే-నాపుఁజేసెదు వాఁడనుగాను
ప్రాపు నీవని నమ్మి కొలిచినఁ బాపముల నెడఁబాసి దయతో
తేపతేపకె నీదు మోమిటు మాపకుండిన నోర్వఁజుమ్మీ
॥అడుగు॥

పతితపావన బిరుదులేదా నన్ను పరిపాలన సేయరాదా
ప్రతిదినంబును దేవతలు భూ-పతివటంచు వేడినను నీ-
హితవు జనములువచ్చి నన్ను వేడికొనినను విడువ నిన్ను
॥అడుగు॥

రాక్షసాంతక సీతారమణా! సారసాక్ష! సద్గుణ భక్తభరణా
ఈ క్షణంబున దీనజనుఁడని మోక్షమియ్యకయుంటివైనను
సాక్షిఁబెట్టి నేఁడు వేఱొక దీక్షచే సాధింతు నిన్నూ
॥అడుగు॥

భూరిభద్రాచలవాసా! రామ! భుజగశయన! భక్తపోషా!
కూరిమిగ నిను విడిచిపెట్టిన ధరణిలో భద్రాద్రిరాఘవా
రామదాసుఁడనెడి నామము మాఱు పేరునఁ బిలువునన్ను
॥అడుగు॥

అని నిరోధించును. ఇంక

"రామా! నీచే నేమి కాదుగా - సీతాభామామాకైనఁ జెప్పరాదుగా
సామాన్యులు నన్ను సకలబాధలు పెట్ట నా మొఱాలకించి
మోమైనఁ జూపవు రామా! శరచాపములఁ శక్తి కి దప్పెన
నీ శౌర్యము జలధిఁ జొచ్చెనా.

అని సీతద్వారా చెప్పింపఁదలఁచును.

రాగము-కళ్యాణి ఆదితాళము.

ననుఁ బ్రోవమని చెప్పవే సీతమ్మతల్లి! నను బ్రోవమని చెప్పవే
నను బ్రోవమని చెప్పు నారీశిరోమణి జనకుని కూఁతురా!
జననీ జానికమ్మ అని సీతను ప్రార్థించును.

ఇట్లు భక్తుల చరిత్రలు విలక్షణమై యుండును.

**మూ.** త్రిరూప భంగపూర్వకం నిత్యదాస నిత్యకాంతా భజ
నాత్మకంవా ప్రేమైవకార్యం ప్రేమైవకార్యం. (నార.౬౬)

సూ. స్వామి, సేవకుఁడు, సేవ, పతి, పత్ని, పతిసేవ
మొదలగురీతిగా నిట్టి మూఁడు రూపములను వీడి నిత్యము దాసరూప
ముగాను, నిత్యము కాంతారూపముగను సేవించెడి ప్రేమయె భగ
వంతునిపైని జేయవలయును, అట్టి ప్రేమయె భగవంతునిపైని జేయ
వలయును.

"కృష్ణభక్తిః కృష్ణ దాస్యం వరేషుచ వరం వరం
శ్రేష్ఠా పంచవిధా ముక్తే ర్హరిభక్తిర్గరీయసీ
బ్రహ్మత్వాదపిదేవత్వా దింద్రత్వా దమరాదపి
అమృతాత్ సిద్ధిలాభాచ్చ హరిదాస్యంప దుర్లభం"

కృష్ణభక్తియు కృష్ణదాస్యమును వరములలో గొప్పవరము. పంచవిధమైన ముక్తికంటె శ్రేష్ఠమైన హరిభక్తి గొప్పది. 1 బ్రహ్మత్వము 2 దేవత్వము 3 ఇంద్రత్వము 4 అమరత్వము 5 అమృతరూపమైన సిద్ధిలాభము అను పంచవిధ ముక్తులకంటె హరిదాస్యము సులభము. (బ్రహ్మవైవర్తము. కృ. ౯౭ ౮. ౯)

మూ. భక్తా ఏకాంతినో ముఖ్యాః (నార. ౬౭)

సూ. భగవంతునియందు అనన్యభక్తిగలవారె శ్రేష్ఠులు.

మూ. కంఠావరోధరోమంచాశ్రుభిః పరస్పరం లపమానాః పావయంతి కులాని పృథివీంచ. (నార. ౬౮)

సూ. అట్టి భక్తులు గద్గదస్వరములతో పులకాంకురములతో ఆనందభాష్పములతోఁ గూడి పరస్పరము సంభాషించుకొనుచుఁ దమ కులములను భూమిని పవిత్రము చేయుదురు.

మూ. తీర్థీకుర్వంతి తీర్థాని, సుకర్మీకుర్వంతి కర్మాణి, సచ్ఛాస్త్రీ కుర్వంతి శాస్త్రాణి. (నార. ౬౯)

సూ. అట్టి భక్తులు క్షేత్రములను సుక్షేత్రములుగను, కర్మలను సత్కర్మలుగను, శాస్త్రములను సచ్ఛాస్త్రములుగను జేయుదురు.

మీయందు విష్ణుండు మెఱయుకతన
మీర తీర్థంబులు మీకంటె మిక్కిలి
తీర్థంబులున్నవే తెలిసిచూడ
గీ. వేఱె తీర్థంబు లవనిపై వెదుకనేల
మిమ్ముఁబొడఁగని భాషించుమేలెచాలు

(భాగ: ౧. ౨౬౫)

మూ. తన్మయాః (నార. ౭౦)

సూ. ఆ భక్తులు తమ సర్వస్వమును భగవంతుని కర్పించి భగవన్మయులైరి కాన వార లన్నిటిని పవిత్రము చేయుదురు.

కన్నులు మూసికొని భక్తితో గానముచేయుటలో బాహ్య విషయములను గ్రహించు కనులు చెవులు మనస్సు లయమొంది అవి పరమేశ్వరునియందుఁ గలిసిపోవునో అప్పుడు వారు తన్మయు లగుదురు.

మూ. మోదంతే పితరో, నృత్యంతి దేవతాః
సనాథా చేయం భూర్భవతి. (నార. ౭౧)

సూ. ఇట్టి భక్తులను గని తల్లిదండ్రులు ఆనందింతురు. దేవతలు నాట్యములు చేయుదురు. ఈ భూమియు సత్ప్రభువుగలదగును.

మూ. నాస్తి తేషు జాతి విద్యారూపకుల ధనక్రియాది భేదః
(నార. ౭౨)

సూ. అట్టి భక్తులలో జాతినిబట్టిగాని, విద్యనుబట్టిగాని రూపమునుబట్టిగాని కులమునుబట్టిగాని ధనమునుబట్టిగాని కర్మలు మొదలగు వానిని బట్టిగాని భేదము లేదు.

వైష్ణవ గ్రంథములలో ఈ క్రింది ౬౪ అపరాధములు చేయరాదని చెప్పఁబడెను. ౧ భగవంతుని నేదో యొక చిన్న దేవతయని గాని యొక తత్త్వమనిగాని తలఁచుట. ౨ వేదములను సామాన్య గ్రంథములని పౌరుషేయములని తలఁచుట. ౩ భక్తులలో జాతిభేదబుద్ధి. ౪ గురువును సామాన్య మానవుఁడనుకొనుట. ౫ భగవంతుని ప్రతిమను కఱ్ఱఱాయి. లోహము మట్టి కాగితము అని తలఁచుట. ౬ భగవ

ప్రసాదమును సామాన్య పదార్థ మనుకొనుట. ౭ భగవంతుని చరణామృతమును మామూలు నీరు అనుకొనుట. ౮ తులసి మొక్కను మామూలు మొక్క అనుకొనుట ౯ గోవును మామూలు పశువను కొనుట ౧౦ భాగవతమును గీతను (ఇతర పవిత్రగ్రంథములను) మామూలు పుస్తకము లనుకొనుట ౧౧ దైవలీలలను మామూలు పనులుగాఁ దలఁచుట ౧౨ భగవద్భక్తులను సాంసారిక ప్రేమగాఁ గాని స్త్రీ సుఖముగాఁ గాని తలఁచుట ౧౩ గోపికలను పరస్త్రీలుగాఁ దలఁచుట ౧౪ రాసలీలలను కామచేష్టగా తలఁచుట ౧౫ భగవంతుని మహోత్సవములలో అంటరానితనము పాటించుట ౧౬ ఈశ్వరుని శాస్త్రములను నమ్మక నాస్తికులగుట ౧౭ సందేహముతో ధర్మాచరణము చేయుట ౧౮ ధర్మాచరణలో ఆలస్యము ౧౯ భక్తులను మామూలు విషయములపై కసరుట ౨౦ సాధుమహాత్ముల గుణదోషములను పరిశీలించుట ౨౧ తమను ఉత్తములనుకొనుట ౨౨ ఏ దేవతనైనను ఏ శాస్త్రమునైనను నిందించుట ౨౩ భగవంతుని మూర్తియెదుట పీటవేసికొని (గర్వముతో) కూర్చుండుట ౨౪ భగవంతుని మూర్తి యెదుట చెప్పులతో నడచుట ౨౫ భగవంతుని మూర్తియెదుట మాల ధరించుట ౨౬ భగవన్మూర్తి యెదుట కప్పుపుచ్చుకొని వెళ్లుట ౨౭ భగవన్మూర్తి యెదుట నల్లని వస్త్రములను ధరించుట ౨౮ మొగము కడుగుకొనకుండ వెళ్లుట ౨౯ మలత్యాగాదికర్మల పిదప వస్త్రములు మార్చక గుడిలోనికి ప్రవేశించుట ౩౦ భగవన్మూర్తి యెదుట తాంబూలసేవనము ౩౨ గట్టిగా నవ్వుట ౩౩ చెడ్డ చేష్టలు చేయుట ౩౪ స్త్రీలచుట్టు తిరుగుట ౩౫ కోపపడుట ౩౬ భగవన్మూర్తి యెదుట ఇంకొకనికి నమస్కరించుట ౩౭ దుర్గంధ వస్తువు తిని వాసన పోకముందె గుడిలోనికి వెళ్లుట ౩౮ మత్తుపదార్థముల సేవించుట ౩౯ ఎవరినైన అవమానించుట కొట్టుట ౪౦ కామక్రోధాదులు చేయుట

౪౧ అతిథులను సాధులను ఆహ్వానించకపోవుట ౪౨ తన్ను భక్తునిగా ధర్మాత్మునిగా సాధువునుగాఁ దలఁచుట ౪౩ నాస్తిక, వ్యభిచారి హింసకలోభిమిథ్యావాదుల సంగము ౪౪ ఆపదలలో దేవునిపై నింద మోపుట ౪౫ పాపముకొఱకు ధర్మముచేయుట ౪౬ ఎవరికైన ఏదైన కష్టము చేసి తన్ను ధర్మాత్ముఁడనుకొనుట ౪౭ స్త్రీలను పుత్త్రులను కుటుంబమును ఆశ్రితులను దీనులను సాధువులను పోషింపకపోవుట ౪౮ ఏదైన వస్తువును భోగ్యముగా నెంచి భగవంతునికి నివేదనము చేయుట, లేక నివేదన చేయక భుజించుట ౪౯ తన యిష్ట దేవత పేరుతో నొట్టుపెట్టుకొనుట ౫౦ ధర్మమును దేవుని పేరును అమ్మి ధనము సంపాదించుట ౫౧ తన యిష్టదేవతను విడిచి రెండవవానితో ఆశపెట్టుకొనుట ౫౨ శాస్త్ర మర్యాదను దాటుట ౫౩ బ్రహ్మజ్ఞానము లేకుండనె బ్రహ్మజ్ఞానిగా ప్రవర్తించుట ౫౪ సంప్రదాయభేదముచే విష్ణుభక్తులలో తారతమ్య భేదము చూపుట ౫౫ భక్తులయెడ దేవతా సమానముగ ప్రవర్తించుట ౫౬ అవతారముల లీలలలో తారతమ్యము చూపి వానిని నిందించుట ౫౭ వేళాకోళమునకైనను మీరె దేవులు అని యనుట ౫౮ భగవంతుఁడు ఎవరికో యొకరి సుఖము చేయునని పొరపాటుచేనైన తలఁచుట ౫౯ లోభముచేత ఎవరికైన భగవత్ప్రసాదమునుగాని చరణామృతముగాని ఇచ్చుట ౬౦ భగవంతుని చిత్రములను ప్రతిమలను నామములను అవమానించుట ౬౧ ఏ ప్రాణికైనను ఏ విధముగానైనను కష్టమునుగాని భయమునుగాని చూపుట అహితము చేయుట ౬౨ తర్కవితర్కములలో ఓడి సిద్ధాంతమును స్థాపనచేయకగాని ఆస్తికత్వమును విడచుట ౬౩ భగవంతుని యవతారముల జన్మకర్మలను మామూలుగాఁ దలఁచుట ౬౪ భగవంతుని యుగళరూపములో ద్వైతబుద్ధి. ఈ యపరాధములుగలుగకుండ భక్తుఁడు జాగరూకత వహింపవలయును.

మూ. యత స్తదీయాః (నార. ౭౩)

సూ. ఏలయనఁగా భక్తులు భగవంతునివారెగదా.

(ఇది ఎనిమిదవ ప్రకరణము)

# భక్తితత్త్వ దర్శనము

## తొమ్మిదవ ప్రకరణము

### ప్రేమస్వరూపము అనిర్వచనీయము

మూ. భజనీయే నా ద్వితీయమిదం కృత్స్నస్య తత్స్వరూపత్వాత్ (శాం. ౮౫)

సూ. సమస్తము భగవంతుని స్వరూపమగుటవలన ఈ ప్రపంచమంతయు భజింపఁదగిన భగవంతునితో అభిన్నమైనదె.

మూ. తచ్ఛక్తిర్మాయా జడసామాన్యాత్ (శాం. ౮౬)

సూ. ఇతరమైన జడప్రపంచముతో సమానమగుటవలన ఆ భగవంతుని శక్తియగు మాయయును భగవంతునితో అభిన్నమైనదె.

సూ. వ్యాపకత్వాద్వ్యాప్యానాం. (శాం. ౮౭)

సూ. వ్యాప్యములగు వస్తువులు వ్యాపకములగుటవలన భగవంతునితో అభిన్నములైనవె.

మూ. న ప్రాణబుద్ధిభ్యోఽసంభవాత్ (శాం. ౮౮)

సూ. అసంభవమగుట వలన ఏదో యొక ప్రాణియొక్క బుద్ధులనుబట్టి యీ సృష్టి కాలేదు.

ఇంత క్రమముతో ఇంత నియమముతో ఇంత సృష్టిని భగవంతుఁడె కాక యింక నెవ్వఁడును జేయుట అసంభవమని భావము.

మూ. నిర్మా యోచ్చావచం శ్రుతీశ్చ నిర్మిమీతే పితృవత్
(శాం. ౭౯)

సూ. ఉచ్చనీచ స్థూలసూక్ష్మాది రూపముగా ఈ ప్రపంచమును సృజించి, తండ్రి కొడుకును గని వానికి విద్యాబుద్ధులను గరపినట్లు భగవంతుఁడు ప్రపంచమునకు కర్తవ్యమును తెలుప వేదశాస్త్రాదులను నిర్మించెను.

మూ మిశ్రోపదేశా న్నేతిచేన్న స్వల్పత్వాత్ (శాం. ౮౦)

సూ. వేదములలో ధర్మోపదేశముతోపాటు హింసామయ యాగరూప ముపదేశించి ధర్మాధర్మమిశ్రము ఉపదేశించుట వలన భగవంతుఁడు తండ్రివంటివాఁడు కాఁడు అన్నచో అట్లనరాదు అందున్న హింస స్వల్పము

మూ. ఫలమస్మాద్బాదరాయణో దృష్టత్వాత్ (శాం. ౮౧)

సూ. లోకములో శుభాశుభకర్మలకు ఫలము రాజాదు లిచ్చునట్లు దృష్టమగుటవలన, మన శుభాశుభకర్మలకు ఫలము ఈ పరమేశ్వరుని వలననె యగునని వ్యాసుఁడు చెప్పెను.

బ్రహ్మసూత్రములో ఈశ్వరుని వలన జీవునికి జన్మాదులుకలుగుచున్నట్లు (బ్రహ్మసూ. ౧. ౧. ౨) చెప్పెను.

మూ. వ్యుత్క్రమా దప్యయస్తథా దృష్టం (శాం. ౮౨)

సూ. విపరీతక్రమము వలన భూతములు తమ కారణములో లయించును అట్లును జూడఁబడెను.

కుండ బ్రద్దలై మట్టిలోఁ గలిసినట్లు పృథ్వి జలములోను జలము అగ్ని లోను, అగ్ని వాయువులోను వాయువు ఆకాశములోను లయించునని తెలియునది.

మూ. ఉదైక్యం నానాత్వైకత్వ ముపాధియోగ హానా దాదిత్య వత్. (శాం. ౯౩)

సూ. జలపూర్ణఘటోపాధులలో ప్రతిబింబించి అవి పోఁగా తన యందె యేకమైన సూర్యునివలె జీవత్వోపాధులున్నపుడు నానాత్వ మును అవిపోఁగా ఏకత్వముగలిగిన భగవంతుఁడు నైక్యమొందును.

మూ. పృథగితి చేన్న పరేణా సంబంధాత్ ప్రకాశానాం. (శాం. ౯౪)

సూ. జీవులు బద్ధులుగాను ముక్తులుగాను ఉండుటవలన జీవులు పరమేశ్వరునికంటె వేఱు అన్నచో అట్లు అనరాదు. ప్రకాశరూపమైన జీవులకు స్వయంప్రకాశమైన పరమాత్మతోఁగూడ ద్రష్టృ దృశ్యరూప ముగా సంబంధము లేకపోవుచున్నది. కనుక.

మఱి చైతన్య ప్రకాశరూపముగా జీవులు ఈశ్వరునితో అభిన్నమైనవి. బద్ధులు ముక్తులు అను కల్పన అజ్ఞానవశమైనదని భావము.

మూ. న వికారిణస్తుకరణ వికారాత్ (శాం. ౯౫)

సూ. జీవులు సుఖదుఃఖాదులనుబట్టి వికారగుణములు గలవి మాత్రము గావు. అవి సాధనమైన యంతఃకరణ వికారము వలన వికారులగుచున్నవి గాని ఆత్మవలనఁగావు.

మూ. అనన్య భక్త్యా తద్బుద్ధి ర్బుద్ధిలయా దత్యంతం.
(శాం. ౯౬)

సూ. భగవంతునియందు అనన్యభక్తిచేత అత్యంతము జీవుని బుద్ధి లయమగుటచేత పరమాత్మబుద్ధి కలుగుచున్నది.

మూ. ఆయుశ్చిర; మితరేషాం తు హాని రనాస్పదత్వాత్.
(శాం. ౯౭)

సూ. పరమభక్తి సిద్ధించినపిదప ముక్తిపొందుటకు ఆయువుండుటయె యాలస్యము. ఆయువు పూర్తికాఁగా ఇతర కర్మములకైతే ఆధారము లేకపోవుట వలన నాశము గలుగును.

మూ. సంసృతిరేషామభక్తిః స్యాన్నాజ్ఞానాత్ కారణాఽసిద్ధేః
(శాం. ౯౮)

సూ. ఈ జీవులకు భక్తి లేకపోవుటయె సంసారము. అజ్ఞానము వలన సంసారమగునని యనరాదు. ఏ జీవికిని ఏదో కొంత జ్ఞానము ఉండును గాన అజ్ఞానరూప కారణము సిద్ధించుటలేదు గాన.

మూ. త్రీ ణ్యేషాం నేత్రాణి, శబ్ద లింగాక్ష భేదాద్రుద్రవత్.
(శాం. ౯౯)

సూ. రుద్రునికి మూఁడు కన్నులున్నట్లు ఈ జీవులకు శబ్దము అనుమానము ప్రత్యక్షము అను మూఁడు ప్రమాణ రూపనేత్రములు గలవు.

వస్తుతత్త్వమును దెలియుటకు ప్రత్యక్షము (ఇంద్రియ విషయ సంనికర్షము) అనుమానప్రమాణము, శబ్దము (వేదశాస్త్రాదిది యథార్థవాక్యములు) అను ప్రమాణములు) అను ప్రమాణములు నేత్రములువలె నుపయోగించునని భావము.

మూ. అవి స్తిరోభావా వికారాః; స్యుః క్రియాఫల సంయోగాత్. (శాం ౧౦౦)

సూ. ఉత్పత్తి వినాశములు వానిద్వారా క్రియాఫలసంయోగముండుట వలన వికారములగుచున్నవి.

ఉత్పత్తిక్రియకు ఫలము ప్రకటమగుట, వినాశక్రియకు ఫలము అదృశ్యమగుట ఈ క్రియాఫలములకు దేశకాల విశేషములనుబట్టి కలుగు సంయోగమునే ఉత్పత్తి యని వినాశమని యందురు. పరమభక్తి వలన తత్త్వజ్ఞానము ఉదయింపఁగా వికారబుద్ధిలయమగును. మఱి యన్నిచోట్ల పరమాత్మ సాక్షాత్కారము కలుగును. కాన భక్తిని ఆశ్రయింపవలెనని భావము.

(ఇది తొమ్మిదవ ప్రకరణము)



# భక్తితత్త్వ దర్శనము

## పదవ ప్రకరణము

### వాదము చేయరాదు

మూ. వాదో నా వలంబ్యః (నారద ౭౪)

సూ. భక్తుఁడెపుడును వాద వివాదములలోఁ బడరాదు. వాద వివాదములలోఁ బడినచో అహంకారము ద్వేషము క్రోధము హింస వైరము మొదలగునవి పెరుగును గాన వాని జోలికిఁ బోరాదని భావము.

మూ. బాహుళ్యావకాశా దనియతత్వాచ్చ. (నార. ౭౫)

సూ. వాదవివాదములలోఁ బడినచో అవి బహుళమగుట కవకాశముండుట వలన, ఆ వాదము వాదిబలమునుబట్టి నియతమైనది కాకపోవుట వలనను అందు పడరాదు.

కనుకనే బ్రహ్మసూత్రములలో 'తర్కాఽప్రతిష్ఠానాత్' (బ్రహ్మ సూ. ౨. ౧. ౧౧.) తర్కము నిలుకడలేనిది కనుక అది ప్రమాణముగాదు అని వ్యాసుఁడు చెప్పెను.

మూ. భక్తి శాస్త్రాణి మననీయాని తదుద్బోధక కర్మాణ్యాపి కరణీయాని. (నార. ౭౬)

సూ. భక్తిని దెలుపు శాస్త్రములు మననము చేయఁదగినవి. దాని నుద్బోధించు కర్మలును జేయఁదగినవి.

భక్తిప్రాప్తికై ఈ క్రిందఁ గొన్ని ప్రధానకర్మలు చెప్పఁబడుచున్నవి.

౧. వర్ణాశ్రమ ధర్మాచరణము, యజ్ఞదాన తపస్త్యాగాదులను ఆచరించుట.

౨. సదాచారపాలనము.

౩. సత్సంగము, భగవద్గుణ శ్రవణ మనన కీర్తనలు.

౪. భగవన్నామ జపస్మరణాదులు.

౫. భగవత్పూజ స్తుతి, ప్రార్థనా నమస్కారాదులు.

౬. సాధు భక్తుల సేవయు తదాజ్ఞాపాలనమును.

౭. తీర్థయాత్రా సేవనము.

౮. దీనజనసేవ, వారిపైని దయ

౯. సర్వకర్మలు భగవంతుని కర్పించుట.

౧౦. అన్ని ప్రాణులందు భగవంతునిఁ జూచుట.

చ. అనిశము సర్వభూతహృదయాంబుజ వర్తియనందనర్చు నీ
శు నను, నవజ్ఞ చేసి మనుజుండొగి మత్ప్రతిమార్చనా విడం
బనమున మూఢుఁడై యుచితభక్తిని నన్ను భజింపఁడేని న
మ్మనుజుఁడు భస్మకుండమున మానక వ్రేల్చినయట్టి వాఁడగున్.
(భాగ. ౩. ౯౬౧)

"ఏ ప్రాణుల ద్వేషింపక, స్నేహాంబుదయగల్గియున్
మమత్వాహంకృతుల్ వీడి, సుఖదుఃఖాలఁ దుల్యులై
తుష్టులై యెప్డు యుక్తులై, వశులై స్థిరబుద్ధులై
మనోబుద్ధుల్ నాకర్పించు, భక్తుల్ వాకుఁ బ్రియుల్ సుమీ
దుఃఖేచ్ఛల్ వీడి శుచులై సమర్థులై తటస్థులై
కర్మఫలంబులన్ వీడు, భక్తుల్ నాకుఁ బ్రియుల్ సుమీ.
(నా తెనుఁగు గీత ౧౨)

"ద్విషతః పరకాయే మాం మానినో భిన్నదర్శినః,
భూతేషు బద్ధవైరస్య నమనః శాంతి మృచ్ఛతి".

"పరశరీరమున నన్ను ద్వేషించి మానియై భిన్నదర్శియై, భూతము లందు బద్ధవైరుఁడైనవానికి శాంతి గలుగదు."

(భాగ. ౩. ౨౯. ౨౩)

త్వయి మయి చాన్య త్రైకో విష్ణుః
వ్యర్థం కుప్యసి మయ్యసహిష్ణుః భజగోవిందం.

"నీలో నాలో నెట నొక దేవుఁడె, యోర్వక నాపయి నూరక యలిగెదు నిఖలప్రాణుల నన్నే చూడుము. విడువుమి యెల్లెడ వేఱను భ్రాంతిన్.

(నా కొలువుము దేవున్ లోనిది)

ఇత్యాదికములు మనము చేయఁదగినవి.

మూ సుఖదుఃఖేచ్ఛా లాభాదిత్యక్తేకాలే ప్రతీక్ష్య మాణే క్షణార్ధమపి వ్యర్థం న నేయం. (నార. ౭౭)

సూ. సుఖమును దుఃఖమును ఇచ్చును లోభము మొదలగు వానిని త్యజింపఁగల్గిన కాలమును నిరీక్షించుచు అర నిముసముగూడ భగవద్భజన లేకుండ వ్యర్థముగా గడపరాదు.

"కనుచుండన్ నశియించు నాయు విదె, యింకన్ రోజురోజిట్లెయా
వన మేఁగున్, మఱిరావు, చన్న దినముల్, భక్షించుఁ గాలం బెయం
తను, నా లక్ష్మి తరంగ భంగచల మేతత్ప్రాణమిట్టే చనున్
గనుకన్ నిన్ శరణొందునన్ శరణదా! కాపాడు కాపాడుమీ,

అని తలఁచి ప్రతిక్షణమును భగవంతుని భజింపవలెను.

మూ. అహింసా సత్యశౌచ దయాస్తికాది చారిత్ర్యాణి పరిపాలనీయాని. (నార. ౭౮)

సూ. అహింస, సత్యము, శౌచము, దయ యాస్తిక్యము మొదలగు సదాచారములు పాలింపఁదగినవి.

మూ. సర్వదా సర్వభావేన నిశ్చింతితైర్భగవానేవ భజనీయః (నార. ౭౯)

సూ. ఎల్లప్పుడును ఎల్లభావముతోను నిశ్చింతులై భగవంతునినే భజింపవలయును.

మూ. స కీర్త్యమానః శీఘ్రమేవావిర్భవతి, అనుభావయతిచ భక్తాన్. (నార. ౮౦)

సూ. ఆ భగవంతుఁడు కీర్తింపఁబడుచున్నవాఁడై శీఘ్రముగానే యావిర్భవించును ఆవిర్భవించి తన భక్తులను తన రూపము ననుభవింపఁజేయును.

"నాహం వేదైర్నతపసా నేజ్యయా నాపితీర్థతః
సంతుష్యామి ద్విజ శ్రేష్ఠ యథానామ్నాం ప్రకీర్తనాత్"

"నామములను కీర్తించుటచే నెట్లు సంతోషము పొందుదునో అట్లు నేను వేదాలచేఁగాని తపసుచేఁగాని యజ్ఞముచేఁగాని తీర్థమువల్లఁగాని సంతోషము పొందను బ్రాహ్మణ శ్రేష్ఠుఁడా!" అని సూక్తి

"ధ్యాయన్కృతే యజన్ యజ్ఞైః త్రేతాయాం, ద్వాపరేఽర్చయన్
యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవం,
(విష్ణుపు. ౬. ౨. ౧౭)

కలియుగమున ధ్యానించుచు త్రేతాయుగమున యజించుచు ద్వాపర మున అర్చించుచు దేనిని పొందునో కలియుగమున కేశవుని కీర్తించి దానిని పొందును.

"న దేశకాలనియమః. శౌచాశౌచ వినిర్ణయః పరం సంకీర్తనాదేవ, రామరామేతి ముచ్యతే"

నామకీర్తనమునకు దేశకాలముల నియమములేదు శౌచాశౌచ నియ మమునులేవు. రామరామ అని బాగుగాఁ గీర్తించుటచే ముక్తిని పొందును.

రామాదినామములు కీర్తించుచు రామతత్త్వమును భగవతత్త్వ మును దెలిసికొనుచు ఇదివఱలోఁ జెప్పినట్లు కామక్రోధాదులను విడిచి భగవంతుని యందైక్యము కావలయును. లేక కేవలము నామకీర్త నలు చేయుచు తన ప్రవర్తన మార్చుకొనకున్నచో గ్రామఫోనులు మొదలగువానికివలెనే వీనికి భక్తియు ముక్తియు సిద్ధింపదు. వాని జీవితము వ్యర్థమగును.

"నారాయణేతి శబ్దోఽస్తి, వాగస్తి వశవర్తినీ
తథాపి నరకేఘోరే. పతంతీతి కిమద్భుతం"
"నారాయణ శబ్దముండె, చెప్పినట్లుగ వాక్కునున్
ఐనన్ ఘోర నరకానన్, పడెద రెంత వింతయో"

నారాయణాది నామములుగాక ధనాదులను స్మరించుచున్నచో దాని వలన లాభములేదు. కనుక నామములతోపాటు గుణాదులను కీర్తించి మననము చేసికొనుచు భక్తి ముక్తు లనుభవింపవలయును.

"సర్వేశ్వరః సర్వమయః, సర్వభూతహితే రతః
సర్వేషా ముపకారాయ, సాకారోఽభూన్నిరాకృతిః"
(భాగవతము)

"సర్వేశుఁడు సర్వమయుఁ, డఖిల భూతరక్షకుం
డెల్లర యుపకృతికై, నీ రూపుఁడొందె రూపమున్"

అట్టి నారాయణుని నీవిధముగాఁ గీర్తింపవలయును.

"శ్రీకృష్ణ! గోవింద! హరే! మురారే,!
హేనాథ! నారాయణ! వాసుదేవ!
గోపేశ! గోపీశ! భవార్ణవేఽస్మాన్
అనంత! నారాయణ! రక్షరక్ష"

"అచ్యుతున్ గేశవున్ రాము నారాయణున్
కృష్ణు దామోదరున్ వాసుదేవున్ హరిన్
శ్రీధరున్ మాధవున్ గోపికావల్లభున్
జానకీనాయకున్ రాముఁ గొల్తున్ మదిన్

"అచ్యుతున్ కేశవున్ సత్యభామాధవున్
మాధవున్ మోహనున్ రాధికారాధితున్
వల్లవీ వల్లభున్ యోగిజనదుర్లభున్
దేవకీనందనున్ కృష్ణుఁ గొల్తున్ మదిన్"

"శ్రీరామ! నారాయణ! వాసుదేవ!
గోవింద! వైకుంఠ! ముకుంద! కృష్ణ
శ్రీకేశవానంత! నృసింహ! విష్ణో!
నన్ బ్రోవు సంసార భుజంగదష్టున్"

కృష్ణకేశవ కృష్ణకేశవ కృష్ణకేశవ పాహిమాం
రామరాఘవ రామరాఘవ, రామరాఘవ రక్షమాం
సాంబ! సదాశివ! సాంబ! సదాశివ!
హర! హర! హర! సాంబసదాశివ!
సాంబ! సదాశివ! సాంబ! సదాశివ! సాంబ! శివా!

"మహాదేవ! శివ! శంకర! శంభో!
ఉమాకాంత! హరత్రిపురారే!
గంగాధర! వృషభధ్వజ! శూలిన్!
చంద్రమౌళి! జయ అఘహరే!
గోవింద! గోవింద! హరే! మురారే!
గోవింద గోవింద! ముకుంద! శౌరే!
హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలం
కలౌనాస్త్యేవ నాస్త్యేవ, నాస్త్యేవ గతిరన్యథా
హరిపేరే హరిపేరే, హరిపేరే యదొక్కటే
కలిలోలేదు లేదోయి, లేదోయి వేఱుమార్గము,
కింకరిష్యసి సాంఖ్యేన, కింయోగైర్నరనాయక!
ముక్తిమిచ్ఛసి రాజేంద్ర, కురుగోవింద కీర్తనం.

"సాంఖ్యంబుచే నేమిచేతు, యోగాన నేమిచేసెదు
ముక్తిన్ గోరుదేన్ రాజ!. చేయుగోవిందకీర్తనల్.

"శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణే!
సకలార్తి హరే! దేవి! నారాయణి! నమోఽస్తుతే"
మూ. త్రిసత్యస్య భక్తిరేవ గరీయసీ భక్తిరేవ గరీయసీ.

(నార. ౮౧)

సూ. మూఁడు కాలములందును సత్యస్వరూపుఁడైన భగవంతుని భక్తియె గొప్పది భక్తియె గొప్పది.

సూ. గుణ మహాత్మ్యాసక్తి రూపాసక్తి పూజాసక్తి
స్మరణాసక్తి దాస్యాసక్తి సఖ్యాసక్తి కాంతాసక్తి
వాత్సల్యాసక్త్యాత్మ నివేదనాసక్తి తన్మయతాసక్తి
పరమవిరహాసక్తి రూపా ఏకథాప్యేకాదశధాభవతి.

(నార. ८२)

సూ. ప్రేమరూపమైన భక్తి యొకటేవిధమైనదైనను ౧ గుణ మాహాత్మ్యాసక్తి ౨ రూపాసక్తి ౩ పూజాసక్తి ౪ స్మరణాసక్తి ౫ దాస్యాసక్తి ౬ సఖ్యాసక్తి ౭ కాంతాసక్తి ౮ వాత్సల్యాసక్తి ౯ ఆత్మనివేదనాసక్తి ౧౦ తన్మయతాసక్తి ౧౧ పరమవిరహాసక్తి యని పదునొకండు విధములుగ నుండును.

గుణమహాత్మ్యాసక్తిగలవారు :- నారద, వేదవ్యాస శుక యాజ్ఞవల్క్య కాక భుశుండిశేష సూతశౌనక శాండిల్య భీష్మార్జున పరీక్షిత్ పృథు జనమేజయాదులు.

రూపాసక్తిగలవారు :- మిథిలానరనారీమణులు, జనకుఁడు దండ కారణ్యఋషులు. వ్రజనారీమణులు. మొ.

పూజాసక్తిగలవారు :- శ్రీమహాలక్ష్మి పృథువు. భరతుఁడు. మొ.

స్మరణాసక్తిగలవారు :- ప్రహ్లాద, ధ్రువ సనకాదులు

దాస్యాసక్తిగలవారు:- హనుమంతుఁడు అక్రూరుఁడు విదురుఁడు. మొ.

సఖ్యాసక్తిగలవారు :- అర్జునుఁడు ఉద్ధవుఁడు సంజయుఁడు కుచేలుఁడు శ్రీరాముఁడు. మొ.

కాంతాసక్తిగలవారు :- అష్టమహిషులు.

వాత్సల్యాసక్తిగలవారు :- కశ్యపుఁడు. అదితి, సుతప పృశ్నిమనువు శతరూప,దసరథుఁడు కౌసల్య నందుఁడు యశోద దేవకీవసుదేవులు. మొ.

ఆత్మనివేదనాసక్తిగలవారు :- హనుమంతుఁడు, అంబరీషుఁడు, బలి, విభీషణుఁడు శిబి. మొ.

తన్మయాసక్తిగలవారు :- యాజ్ఞవల్క్యుఁడు శుకుఁడు సనకాదిజానులు కౌండిన్యుఁడు సుతీక్ష్ణుఁడు మొదలగు ప్రేమికులు మునులు.
పరమవిరహాసక్తిగలవారు :- ఉద్ధవుఁడు గోపగోపికలు. మొ.

మూ॥ ఇత్యేవం వదంతి జనజల్పనిర్భయా ఏకమతాః కుమారవ్యాస శుక శాండిల్య గర్గ విష్ణు కౌండిన్య శేషోద్ధ వారుణి బలిహనుమద్విభీషణాదయో భక్త్యాచార్యాః (నార. ౮౩)

సూ. కుమారస్వామి, వ్యాసమహర్షి శుకుఁడు శాండిల్యుఁడు గర్గుఁడు సృష్టికర్తయైన విష్ణువు కౌండిన్యుఁడు. శేషుఁడు, ఉద్ధవుఁడు, ఆరుణి. బలి, హనుమంతుఁడు, విభీషణుఁడు మెదలగు భక్త్యాచార్యులు లోకుల నిందాస్తుతులను లెక్కపెట్టక యేకాభిప్రాయులై యిట్లు భక్తి గొప్పదని చెప్పుచున్నారు

మూ. య ఇదం నారదప్రోక్తం శివానుశాసనం విశ్వసితి శ్రద్ధత్తే సప్రేష్ఠంలభతే వప్రేష్ఠం లభతఇతి. (నార- ౮౪)

సూ. ఎవఁడీ నారదప్రోక్తమైన శివానుశాసన (శుభానుశాసన) మందు విశ్వాసముంచి శ్రద్ధగలిగియుండునో వాఁడు ప్రియతముఁడైన భగవంతుని బొందును ప్రియతముఁడైన భగవంతుని బొందును.

ఇది

శాండిల్యనారదమునులచే రచింపఁబడి. చర్ల నారాయణశాస్త్రి
జనక గురువరప్రసాదలబ్ధవిద్యుఁడును వెంకమాంబా
పుత్రుఁడునగు గణపతిశాస్త్రిచే ననువదింపఁబడిన
భక్తితత్త్వ దర్శనమందు పదవ ప్రకరణము
సర్వము సమాప్తము

....○....